కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల నియంత్రణ క్రింద పశువుల ఉత్పత్తి కార్య క్రమాన్ని అమలుజరపటం, సబ్సిడీ పద్ధతిపై దూడలను పెంచడం, సహకార పద్ధతులపై పశుగ్రాస వనరులను అభివృద్ధిపరచడం జరుగుతుంది. 1957—59 సంవత్సరాలలో 10 కీలకగ్రామ కేంద్రాలు ఆంధ్రలో స్థాపించబడినాయి. ఇంకా 9 కేంద్రాలను ప్రారంభించటానికి, యిప్పుడున్న వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 11.107 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.850 లక్ష ఒక క్రొత్త కీలక గ్రామ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## జిల్లా, రాజ్య పశుప్రదర్శనాలు.

పశువుల పెంపకపు దార్లకు ఉత్సాహం కలిగించ టానికి, శాస్త్రీయ పద్ధతులతో పశువులను పెంచడం, మేపడం, నిర్వహించడం గురించి జనసా మాన్యానికి తెలియ చెప్పటానికిగాను రాజ్య, జిల్లా పశుప్రదర్శనలను ఏర్పాటు చేసేటందుకు యీ పథకం క్రింద తలపెట్టబడింది. 1959—60 లో 4 జిల్లా పశు ప్రదర్శనలను ఒక రాజ్య పశుప్రదర్శనను ఏర్పాటు చేయుటకుగాను యీ జిల్లాకు ర. 0.022 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## కోళ్ల పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించ బడిన పైలట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 12 కోళ్ల పెంపకపు విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు 1957—59 సంవత్సరాలకాలంలో ప్రారంభించ బడినాయి. 1959—60 లో యింకా 4 కేంద్రాలను ప్రారంభించటానికి, యింతకు ముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికిగాను ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 2.76 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.587 లక్ష యీ జిల్లాలో ఒక విస్తరణ కేంద్రాన్ని ప్రారంభించడానికి ఒక పాత విస్తరణ కేంద్రాన్ని కొనసాగించేటందుకుగాను ప్రత్యేకించ బడింది.

## పశుగణ పరిశోధన క్షేత్రం, చింతలదీవి

1959-60 లో ఈ పథకం క్రింద రు. 0.58 లక్ష కేటాయించబడింది. ఇందులో రు, 0.48 లక్ష చింతలదీవిలోని పరిశోధన కేంద్రంలోని పశువులకు వైద్యం చేయడానికి పశువుల ఆసువత్రిని నిర్మించటం కోసం వినియోగించ బడుతున్నది. మిగత రు. 0.10 లక్ష 1957-58 లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి వినియోగించబడుతుంది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానిక పశుగణ స్థాయిని పెంచే ఉద్దేశంతో ఆబోతులను, దున్నపోతులను, మేకలను, పోతుపందులను, ఆడపందులను, పొట్టేళ్లను విదేశిరకం కోడిపుంజులు, పెట్టలను, గ్రుడ్లను తక్కువ ధరలకు రైతులకు రెండవ ప్రణాళికా కాలంలో పంపకం చేయటానికి ప్రతిపాదింపబడింది. తక్కువధర అంటే కొన్న ధరలోసగం ధరకు తగ్గించి యివి సరఫరా చేయబడాయి. 1959--60 లో ఈ జిల్లాలో పంపకం చేయడానికి ఉద్దేశించ బడిన పశువుల సంఖ్య. అందుకయ్యే ఖర్చు వివరాలు క్రింద యివ్వబడినాయి.

| | | సంఖ్య | కేటాయించటబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|---|
| 1. | ఆబోతులసరఫరా | 9 | 0.0945 |
| 2. | దున్నపోతులు | 10 | 0.105 |
| 3. | మేకపోతులు | 7 | 0.008 |
| 4. | ఆడమేకలు | 10 | 0.008 |
| 5. | పోతుపందులు | 5 | 0.133 |
| 6. | ఆడపందులు | 2 | 0.006 |

| | | | |
|---|---|---|---|
| 7. | పొట్టేళ్లు | 6 | 0.005 |
| 8. | విదేశీ కోడిపుంజులు | 170 | 0.019 |
| 9. | కోడిపెట్టలు (విదేశీరకం) | 170 | 0.019 |
| 10. | గ్రుడ్లు (విదేశీరకం) | 300 | 0.003 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్ల ఏర్పాటు

ప్రస్తుతం అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో మూడు ఉన్ని ప్రదర్శన యూనిట్లు పని చేస్తున్నాయి. గొఱ్ఱెలను మేపటం, పెంచటం, నిర్వహించటానికి సంబంధించిన విషయాలను గురించి యీ యూనిట్లు ప్రచారం చేస్తాయి. ప్రతి యూనిట్టు ఒక వెటర్నరీ అసిస్టెంటు సర్జను, ఇద్దరు స్టాక్‌మెన్‌ల అజమాయిషీ క్రింద నిర్వహింప బడుతున్నది. 1959—60 తో ప్రస్తుతమున్న మూడు యూనిట్లకు అదనపు సిబ్బందిని నియమించడానికి, నంద్యాల, విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని పట్టణాలలో యింకా 4 క్రొత్త యూనిట్లను ఏర్పాటు చేయటానికి, యింతేకాక అదనంగా మినిస్టీరియల్ సిబ్బందిని నియమించటంద్వారా షీప్ అండ్ గోట్ డెవలప్‌మెంట్ ఆఫీసరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయుటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.94 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.05 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## జిల్లా కోళ్ల పెంపక క్షేత్రాలను ప్రారంభించటం.

ప్రస్తుతమున్న కోళ్ల పెంపక క్షేత్రాల ద్వారాను ప్రయివేటు వ్యక్తుల ద్వారాను ఉత్పత్తి చేయబడుచున్న విదేశీరకం కోళ్ల సంఖ్య చాలినంతగా ఉండకపోవడం చేతను, విదేశీరకం కోళ్ల సరఫరాను పెంపొందించే ఉద్దేశంతోను 1959—60 లో రెండు జిల్లా కోళ్ల పెంపక క్షేత్రాలను ప్రారంభించటానికి ప్రతిపాదింప బడింది. ఇందులో ఒక క్షేత్రం యీ జిల్లాలో ఏర్పాటు చేయబడతుంది. ఇందుకుగాను రు. 0.50 లక్ష కేటాయించ బడింది.

## చింతలదీవిలో ప్రభుత్వ పశుగణ క్షేత్రానికి అదనపు సిబ్బంది.

ఈ క్షేత్రంలో ఋుంతకుముందే నియమించ బడిన సిబ్బందిని కొనసాగించడం కోసం 1959—60 సంవత్సరానికి రు. 0.05 లక్ష కేటాయించ బడింది.

## పశువైద్యశాఖ ప్రధానకార్యాలయానికి, జిల్లాపశువైద్య కార్యాలయానికి అదనపుసిబ్బంది నియామకం

పశు వైద్యశాఖలో పని బాగా పెరిగిపోయింది. ఈ పనిని నిర్వహించటం కోసం పశువైద్యశాఖ ప్రధానకార్యాలయాలలోను, చింతలదీవిలోని ప్రభుత్వ పశుగణక్షేత్రంతోసహా జిల్లా పశువైద్య కార్యాలయాలలోను, అదనపు సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.72 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.062 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## రిండరుపెస్టువ్యాధి నిర్మూలనపథకం

దేశంలో రిండరుపెస్టువ్యాధిని (గాళ్లవ్యాధిని) నిర్మూలించేటందుకుగాను భారతప్రభుత్వంవారు వ్యాధిరాకుండా నివారించేటందుకు పశువులన్నిటికీ టీకాలను వేసేకార్యక్రమం ఒక దానిని ప్రారంభించారు. ఈ టీకాలు వేసే ఉద్యమంక్రింద టీకాలు వేయబడకుండా వదలి వేయబడినట్టి పశువులకు టీకాలు వేసేనిమిత్తం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలకు సంబంధించి ఇంకొకపథకం మంజూరు చేయబడింది. రిండరుపెస్టు వ్యాధి నివారణకు కావలసిన టీకాలమందు మొదలైనవి లభ్యంకాకపోవడం వంటి కొన్ని చిక్కులకారణంగా టీకాలు వేసే కార్యక్రమం పూర్తి కాలేదు. ఇందువల్ల పై జిల్లాలలో ఈ రెండు పథకాలను కొనసాగించటానికి తలపెట్టబడింది. మొదట ప్రారంభించబడిన పథకం కృష్ణా నదికి ఉత్తరాన ఉన్న జిల్లాలో ఈ సంవత్సరం పూర్తి అవుతుంది అయితే ఈ జిల్లాలలో కూడా కొన్నిటికి టీకాలు వేయబడకుండా ఉండవచ్చు. అందువల్ల ఈ జిల్లాలలోకూడా ఈ రెండవ పథకాన్ని ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. ఈ పథకం

అమలు జరపటం కోసం 1959-60 ప్రణాళికలో రు. 1.95 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.082లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## క్లినికల్ లేబరేటరీలను స్థాపించటం

రసాయనిక పరీక్షలద్వారా సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయటంకోసం జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులలోను, రాజ్యంలోని పశుగణాభివృద్ధి క్షేత్రాలలోను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలులో ఉన్న ప్రధాన పశువైద్య ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు ఏర్పాటు చేయబడినాయి. 1957—58 లో పశ్చిమ గోదావరి, కృష్ణ, అనంతపురం జిల్లాలలో ఇంకా 3 క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయడానికి, ఇంతకు ముందు ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను యీ జిల్లాకు రు. 0.934 లక్ష కేటాయించబడింది.

## సంచార పశు వైద్యదళాలు, పశు ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్నతరహా పశువైద్య శాలలు, పశువైద్యఆసుపత్రులను ఏర్పాటు చేయటం

గ్రామీణ, పట్టణప్రాంతాలలోని పశువులకు వైద్య సహాయం అందజేయడానికి, అంటువ్యాధులను సమర్థవంతంగా నిరోధించటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ జిల్లాలో 1959—60 సంవత్సరంలో రు. 0.498 లక్ష వ్యయంతో ఒక సంచార వైద్య దళాన్ని 2 చిన్నతరహా పశువైద్యశాలలను, ఒక పశువైద్య ఆసుపత్రిని స్థాపించటానికి ప్రతిపాదింప బడింది. ఇంతకుముందు ప్రారంభించబడిన పశువైద్య ఆసుపత్రులను, సంచార వైద్యదళాలను కూడకొనసాగించటం జరిగింది.

## పెద్దతరహా పశువైద్య సంస్థల్లో లోయరు డివిజను గుమాస్తాల నియామకం,

1958—59 లో నియమించ బడిన 9 మంది లోయరు డివిజను గుమాస్తాలను కొనసాగించటం కోసం 1959—60 ప్రణాళికలో రు. 0.08 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.02 లక్ష యీ జిల్లాలో ఒక లోయరు డివిజను గుమాస్తాను కొనసాగించటం కోసం ప్రత్యేకించ బడింది.

### జిల్లా పశువైద్యశాఖాధి కార్లకు జీపుల సరఫరా.

జిల్లా పశు వైద్యశాఖాధికార్లు తరచుగాను అకస్మాతుగాను తమక్రింది సిబ్బందిపని చేసే తావులకు వెళ్ళివారు చేసే పనిని తనఖీచేసి వారిని అప్రమతులుగా ఉంచాలంటే పై అధికార్లు జీపులను కలిగి యుండటం ఎంతైనా అవసరం. ఇందువల్ల 1959—60 ప్రణాళికలో రు. 0.54 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.141 లక్ష యీ జిల్లాకు యిదివరకే సరఫరా చేయబడిన జీపు నిర్వహణకుగాను ప్రత్యేకించబడింది.

## పాడిపరిశ్రమ - పాలసరఫరా

### పట్టణపాల సరఫరా పథకం

నెల్లూరు పట్టణంలో యింతకుముందే అమలు పరచబడిన పాలసరఫరా పథకంకోసం 1959—60 సంవత్సరానికి రు. 3.90 లక్ష కేటాయించ బడింది. పాడి పరికరాలు కొనడానికి, విద్యుచ్ఛక్తి సరఫరా నీటి సరఫరా ఖర్చులకు, సిబ్బంది ఖర్చులు మొదలగువాటికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## అడవులు

### సరుగుడు తోటల విస్తరణ.

రోజురోజుకు ఎక్కువవుతున్న వంట చెరకు అవసరం దృష్ట్యా ఆంధ్ర ప్రాంతంలోని కోస్తా ప్రదేశాల్లో సరుగుడు తోటలు వేయబడినాయి. 1959—60 లో యీ తోటలను యింకా యీ జిల్లాలోని 178 ఎకరాల భూమిలో వేయటానికి, పాతతోటలను నిర్వహించటానిక ప్రతిపాదింప ఒడింది. ఇందుకు రు. 0 818 లక్ష వ్యయమవుతుంది.

### అడవుల పునరుద్ధరణ.

అటవీశాఖ వారిచే స్వాధీనం చేసికోబడినట్టి ఎస్టేటు, పంచాయితీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఆ అడవులలో పునరుద్ధరణ

క్షేత్రాలు పర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో 2,400 ఎకరాల ప్రదేశంలో పునరుద్ధరణ క్షేత్రాలను వేయుటానికి, పాత క్షేత్రాలను నిర్వహించటానికిగాను ఈ సంవత్సరానికి రు. 0.73 లక్ష కేటాయించ బడింది.

## రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

భూసారం కొట్టుకొని పోకుండా నివారించే నిమిత్తం యీ పథకం క్రింద రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండ వాలులలో గట్లువేసే పద్ధతిని అటవీ పెంపక క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో యింకా 10 ఎకరాల ప్రదేశంలో యీ అటవీ పెంపక కార్యక్రమాన్ని అమలు పరచేటందుకు, పాత క్షేత్రాలను నిర్వహించేటందుకుగాను 1959–60 ప్రణాళికలో రు. 0.005 లక్ష కేటాయించ బడింది.

## జిల్లా అటవీ శాఖాధికార్లకు జీపుల సరఫరా

అటవీ సంపద అక్రమంగా తరలించుకొని పోబడకుండా నివారించేటందుకు జిల్లా అటవీ శాఖాధికార్లు త్వరితంగా పర్యటించటానికి వీలు కల్పించే నిమిత్తం వీరికోసం ట్రైలర్లతోకూడిన 2 జీపులను రు. 0.30 లక్ష వ్యయంతో కొనటానికి ప్రతిపాదించబడింది. ఇవి నెల్లూరుజిల్లా అటవీ శాఖాధికారికి యివ్వబడతాయి.

## కలప రవాణా నిబంధనలను అమలు పరచటం.

కలప అక్రమంగా తరలించుకొని పోబడకుండా నివారించే నిమిత్తం ఒక చోటనుండి యింకొకచోటికి రవాణా చేయబడే కలపమీద కట్టుదిట్టమైన తనిఖీ పర్పాటు చేయటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. 1959—60 లో ఆంధ్ర లోని అన్ని డివిజన్లలోను 80 మంది ఠానాదార్లు నియమించ బడతారు. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.35 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.0743 లక్ష యీ జిల్లాలో 11 మంది ఠానాదార్ల నియామకం నిమిత్తం ప్రత్యేకించ బడింది.

# మత్స్యసంవర్ధన

## చేపపిల్లల సేకరణ, వాటి పంపిణీ.

గోదావరి, కృష్ణనదుల్లోను, తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని డెల్టా ప్రాంతాల్లో ఉన్న నీటిపారుదల కాలువలలోను చేప పిల్లలు పుష్కలంగా లభిస్తాయి. చేపల ఉత్పత్తిని ఎక్కువ చేయుటంకోసం రాజ్యంలోని జలాశయాల్లో నిలువ చేయడానికిగాను చేప పిల్లల్ని, అందులోను త్వరగా పెరిగే రకాల్ని, పై నదులనుండి కాలువలనుండి సేకరించటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఈ చేపలు సేకరించ బడే ప్రాంతాలనుండి నిలువ చేయబడే ప్రాంతాలకు వీటినిరవాణా చేయుటంకోసం 1957—58 లో 12 వ్యానులు కొనబడినాయి. ప్రత్యేక సిబ్బందికూడ నియమించ బడింది. ప్రస్తుతమున్న సిబ్బంది సహాయంతోను, వ్యానుల్ల సహాయంతోను 1959-60 లో 2 కోట్ల చేపపిల్లలను సేకరించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.93 లక్షలమొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాలో 10 లక్షల చేప పిల్లలను సేకరించటానికి గాను ప్రత్యేకించ బడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలో ఉన్న చేపల మార్కెట్లు చాలా వరకు అపరిశుభ్రంగాను, మురికిగాను ఉన్నాయి. చేపల మార్కెట్లను నిర్మించి వాటిని పరిశుభ్రమైన స్థితిలో ఉంచ వలసిన బాధ్యత సామాన్యంగా స్థానిక సంస్థలు, మునిసిపాలిటీలు వహించాలి. అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు చాలా తక్కువగా ఉన్న కారణం వల్ల మార్కెట్ల నిర్మాణానికి సబ్సిడీల నివ్వటం ద్వారా స్థానిక సంస్థలకు సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్దవి 5 చిన్నవి చేపల మార్కెట్లను నిర్మించటం కోసం స్థానిక సంస్థలకు, మునిసిపాలిటీలకు సబ్సిడీల నివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో ఒక మార్కెట్టును యీ జిల్లాలో నిర్మించుటకు ప్రభుత్వ సహాయం లభిస్తుంది.

## ఉప్పు సబ్సిడీ పథకం

అవసరానికి మించి లభ్యమయ్యే చేపలను పరిశుభ్రమైన పరిస్థితులలో నిలువ చేసికొనేటందుకు బెస్తవారికి యీపథకంక్రింద ఉప్పు తగ్గింపుధరలకు సరఫరా చేయబడుతున్నది. ఇందువల్ల వారు తమకష్టానికి తగిన ప్రతిఫలం పొందడానికి వీలు చేకూరుతుంది. ప్రస్తుతం ఆంధ్రలోని కోస్తాజిల్లాలలో చేపలను శుభ్రపరచే కేంద్రాలు 14 ఉన్నాయి. 1959—60 లో వీటిని కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.53 లక్ష ఖర్చవుతుంది. ఇందులో రు. 0.08 లక్ష యీ జిల్లాలో 250టన్నుల చేపలను శుభ్రపరచడానికిగాను ప్రత్యేకించబడింది.

## శీఘ్ర రవాణా సౌకర్యాలు

పెద్దసంఖ్యలో చేపలు చెడిపోకుండా కాపాడటంకోసం 1957—58 లలో 10 వ్యానులు, రెండు క్యారియర్ పడవలు కొనబడినాయి. ప్రస్తుతం రవాణా సౌకర్యాలులేని రోడ్లపై యీ వ్యానులను నడపటానికి అయ్యే "రెకరింగు" ఖర్చును భరించటంకోసం. 1959—60 సంవత్సరానికి రు. 1.00 లక్ష కేటాయించ బడింది. 14 వ్యానులలో ఒకటి ఈ జిల్లాకు లభ్యం చేయబడుతుంది.

## చెరువులలో చేపల అభివృద్ధిపథకం

సర్వేచేసినతర్వాత శాస్త్రీయ పద్ధతుల్లో చేపలను ప్రభుత్వానికి చెందిన చెరువుల్లో పెంచటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఎప్పుడూ నీరు ఉండే చెరువుల్లో చేపలను నిలువచేసి, వాటి ఉత్పత్తిని పెంచటానికి ప్రతిపాదింపబడింది. 200 చెరువులను సర్వేచేసిఅభివృద్ధి పరచటంకోసం ప్రణాళికలో ఈ సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 100 చెరువులు యీ జిల్లాలో అభివృద్ధి చేయబడితాయి.

## పడవల తయారీకేంద్రం

పడవలను తయారు చేయడంకోసం ప్రస్తుతం రాజ్యంలో పడవలను నిర్మించే కేంద్రంలేదు. పడవలకు యంత్రాలను అమర్చి ఆధునికం చేయడం

మూలంగా యీపడవలకు గిరాకి హెచ్చుతున్నందువల్ల రు. 1.00 లక్ష వ్యయంతో తూర్పు గోదావరిజిల్లాలో పడవల తయారీ కేంద్రమొకటి 1958–59 లో స్థాపించబడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 1.00 లక్ష యీ కేంద్రాన్ని నిర్వహించటానికి, 60 పడవలను తయారు చేసేటందుకుగాను ప్రత్యేకించబడింది. ఇందులో 6 పడవలు యీ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

## సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు.

### గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ.

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘంవారు సూచించిన పద్ధతుల ననుసరించి రాజ్యంలోని గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించ టానికి, పటిష్ఠం చేయ టానికి, విస్తరింప చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. సహకార శాఖలో సిబ్బందిని పెంచటంద్వారాను సెంట్రలు బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలచే అదనంగా నియమించ బడిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను యీ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలు జరుప బడింది.

జాతీయ అభివృద్ధి మండలివారు సహకార విధానాన్ని గురించి ఒక తీర్మానాన్ని చేశారు. గ్రామీణులతో సహకార సంఘాల నిర్మాణం జరగాలని అందువారు నొక్కి వక్కాణించారు. ఈ తీర్మానాన్ని పురస్కరించుకొని ఈ సంవత్సరం పెద్ద తరహా సంఘాలను గ్రామీణ బ్యాంకులకు పర్పాటు చేయటం నిలుపుదల చేయబడుతుంది. అయితే ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 350 చిన్న తరహా సంఘాలను పర్పాటు చేయటానికి, ప్రస్తుతమున్న 500 చిన్న తరహాసంఘాలను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందువల్ల యీ సంవత్సరం అంతమయ్యేలోగా నూటికి 82 గ్రామాలు, నూటికి 38 నుంది గ్రామీణ ప్రజలు సహకార సంఘాల క్రిందకు తీసుక రాబడతారు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలుకూడ [illegible]వ్వబడతాయి. పరిపాలన శాఖనుండి ఆడిటు

శాఖను విడతీయటానికి సంబంధించిన పథకాన్నికూడ ఈ సంవత్సరంలో అమలు జరపటానికి ప్రతిపాదింపబడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారుకూడ ప్రధాన కార్యాలయంలో నియమించబడతారు. గ్రామీణ పరపతి విస్తరణ పథకానికి సంబంధించిన పనినిమాత్రం యీయన ప్రత్యేకంగా నిర్వహిస్తారు. ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 100 చిన్న తరహా సంఘాలు క్రొత్తగా ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 55 చిన్నతరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాత సంఘాల్లో 18,600 మంది సభ్యులు, క్రొత్త సంఘాలలో 5,000 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 90 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు రు. 15 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు యివ్వబడతాయి.

పై కార్యక్రమాన్ని అమలు జరపటంకోసం యీ జిల్లాకు రు. 94,060లు కేటాయించబడినాయి. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| | (ఎ) 1958—59 లో ప్రారంభించిన సంఘాలకు | 6,100 |
| | (బి) 1959—60 లో ప్రారంభించబడే సంఘాలకు | 6,500 |
| 2. | (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు | 10,600 |
| | (బి) గ్రామీణ సంఘాలకు సీనియరు ఇనస్పెక్టర్ల నియామకం క్రింద ఖర్చు | 5,600 |
| 3. | సెంట్రలు బ్యాంకులకు సబ్సిడీలు. | |
| | (ఎ) ఇంతకుముందు నియమించబడిన పాత సూపరు వైజర్లకుగాను | 2,000 |

(ఇ) 1559—60 లో నియమించబడే క్రొత్త సూపరు వైజర్లకుగాను 3,000

4. అదనపు సిబ్బందిక్రింద ఖర్చు

| | |
|---|---|
| (ఏ) ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను నియమించబడిన సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లకు | 7,090 |
| (బి) పైలట్ పథకానికిగాను సిబ్బంది నియామకం | —— |
| (సి) పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను సహకార సబ్-రిజిస్ట్రార్ల నియామకం | 8,400 |
| (డి) సహకార సబ్—రిజిస్ట్రార్లు (సి. డి.). టైపిస్టులు, జవానుల నియామకం | 10,600 |
| (ఇ) నెల్లూరు క్రొత్త డిప్యూటి రిజిస్ట్రారు కార్యాలయానికి సిబ్బంది | 18,000 |
| (ఎఫ్) డిప్యూటి రిజిస్ట్రార్ల సర్కిళ్ళు ప్రతి ఒక్కదానిలోను 1959—60 లో జూనియరు ఇనస్పెక్టరు నియామకానికి | 2 670 |
| (జి) నెల్లూరులోని క్రొత్త సర్కిలుకు ఒక జూనియరు ఇనస్పెక్టరు, ఒక సీనియరు ఇనస్పెక్టరు నియామకం | 3,800 |
| (హెచ్) నెల్లూరు సర్కిలులో కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారు (క్రెడిటు), కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారు (ప్లానింగు), టైపిస్టు, జవానుల నియామకం | 9,700 |
| మొత్తం | 94,060 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

నీటి పారుదల వసతిని కల్పించడం, భూమిని సాగుక్రిందకు తీసుకురావటం మొదలయిన శాశ్వతమైన అభివృద్ధి పనులను భూములలో చేయటంకోసం యీ పథకంక్రింద 25 సంవత్సరాలలో తీర్చుకోదగ్గ దీర్ఘకాలిక ఋణాలు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా రైతులకు యివ్వబడతాయి. రు. 8.20 లక్షల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఈ సంవత్సరంలో యీ జిల్లాలో యివ్వబడతాయి. ఈ సంవత్సరానికి యీ జిల్లాకు కేటాయించబడిన రు. 7,200 లు క్రింది విధంగా వినియోగించబడతాయి

| | | |
|---|---|---|
| 1. | ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించబడిన అదనపు సూపరు వైజరులక్రింద ఖర్చు | 2,400 |
| 2. | ఈ సంవత్సరం నియమించబడే అదనపు సూపర్ వైజరులక్రింద ఖర్చు | |
| 3. | భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణకోసం నియమించబడే సహకార సబ్-రిజిస్ట్రార్లు, వారి జవానులక్రింద ఖర్చు | 4,000 |
| | మొత్తం | 6,400 |

## సహకార మార్కెటింగ్ అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. వ్యవసాయదారులకు, ముఖ్యంగా చిన్నరకం మధ్యరకం ఉత్పత్తిదారులకు, స్టోరేజి, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలను కలిగించడం, తద్వారా వ్యవసాయోత్పత్తులకు సహకార మార్కెటింగు సౌకర్యాన్ని ఇతోధికంగా కలుగచేయుడమే యీ పథకం లక్ష్యం. వ్యవసాయోత్పత్తులమీద స్వల్పకాలిక ఋణాలు రైతులకు యివ్వ

బడతాయి. ఇంతేకాక మార్కెటింగు సంఘా లద్వారా రసాయనిక ఎరువులు, అవసరమయ్యే యితర సామాగ్రి రైతులకు సరఫరా చేయ బడతాయి. గ్రామాల స్థాయిలో పనిచేసే ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల కార్యక్రమాలకు, మండీ కేంద్రాలలో పనిచేసే మార్కెటింగు సంఘాల కార్యక్రమాలకుమధ్య సమన్వయం చేకూర్చడానికికూడ యీ పథకం ఉద్దేశించబడింది.

ఈ పథకంయొక్క పై లక్ష్యాలను సాధించడంకోసం రెండవ ప్రణాళికలో ప్రాథమిక మార్కెటింగు సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయటానికి ఉద్దేశించబడింది. మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులను, గ్రామాల స్థాయిలోని మండీలలో ఉప గిడ్డంగులను నిర్మించటానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకు క్రషర్లు మొదలయిన ప్రాసెసింగు ప్లాంటులను నెలకొల్పటానికిగాను సంఘాలకు సహాయం చేయటంకోసం రాజ్య ప్రభుత్వం యీ కార్యక్రమాలలో పాల్గొంటుంది. శిక్షణ పొందిన సిబ్బంది సహాయం, ఆర్థిక సహాయంకూడ యీ సంఘాలకు యివ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమం యీ జిల్లాలో అమలు జరుపబడుతుంది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను యివ్వటం (రూపాయలు,లక్షలలో) | 46·00 |
| 2. | మార్కెటింగు సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 1 |
| 3. | పెద్దతరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 4 |

పై కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం యీ జిల్లాకు రు. 3.080 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

రూపాయలు లక్షలలో

| | | |
|---|---|---|
| 1. | మార్కెటింగు సంఘాలకు వాటామూల ధనం క్రింది విరాళం | 0.800 |

| | | |
|---|---|---|
| 2. | జిల్లా మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనం క్రింద విరాళం | 0.400 |
| 3. | ప్రాథమిక మార్కెటింగు సంఘాలయొక్క నిర్వాహక సిబ్బంది ఖర్చుక్రింద సబ్సిడి. | |
| | (ఎ) గత మూడు సంవత్సరాలుగా సిబ్బందిని నియమించిన సంఘాలకు | 0.060 |
| | (బి) 1959—60 లో సిబ్బందిని నియమించే సంఘాలకు | 0.030 |
| 4. | పెద్దతరహా సంఘాలకు గిడ్డంగులు | |
| | (ఎ) గత సంవత్సరాలలో నిర్మాణం ప్రారంభించబడిన గిడ్డంగులను పూర్తిచేయుటకు. | 0.860 |
| | (బి) 1959—60 లో నిర్మాణం ప్రారంభించబడే క్రొత్తగిడ్డంగులకు | 0.450 |
| 5. | మార్కెటింగు సంఘాలచే గిడ్డంగులనిర్మాణం. | |
| | (ఎ) పాతగిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తిచేయుటకు | 0.180 |
| | (బి) క్రొత్తగిడ్డంగులనిర్మాణానికి | 0.300 |
| | మొత్తం | 3.030 |

## లేబరు కాంట్రాకు సంఘాలు, ఫారెస్టు కూప్ సంఘాలు ఏర్పాటుచేయడం

రెండవ ప్రణాళికా కాలంలో 15 లేబరు కంట్రాక్టు సంఘాలను, 15 ఫారెస్టు కూప్ సహకార సంఘాలను ఏర్పాటు చేయుటానికి లేక పునరుద్ధ

రించటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. ఋణాలు, సబ్సిడీల రూపంలో ఆర్థిక సహాయం చేయటం ద్వారా 1957–59 సంవత్సరాల కాలంలో 5 లేబరు కంట్రాక్టు సంఘాలు, 5ఫారెస్టు కూప్ సహకార సఘాలు ఏర్పాటు చేయబడి, అభివృద్ధి చేయబడినాయి. 1959–60 లో 5 ఫారెస్టు కూప్ సహకార సంఘాలను, 6 లేబరుకాంట్రాక్టు సంఘాలను పునరుద్ధరించి, పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకోసం ఆర్థిక సహాయం చేయుబడుతుంది. ఈ సహాయం గ్రాంట్ల రూపంలోను, లేబరును సమకూర్చటం ద్వారాను యివ్వబడుతుంది. ఇందుకు యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.42 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 5,000 లు రాజ్యస్థాయిలో నియమించ టానికి ప్రతిపాదింప బడిన సాంకేతిక సిబ్బంది కోసం ప్రత్యేకించ బడింది. మిగత రు. 0.42 లక్షలో రు. 12,300లు యీ జిల్లాలో 2 ఫారెస్టు కూప్‌సంఘాలను, ఒక లేబరు కంట్రాక్టు సంఘాన్ని పునరుద్ధరించుటకుగాను ఆర్థిక సహాయం యివ్వటానికి వినియోగింప బడుతుంది. ఇందులో రు. 3,600 లు గ్రాంటుగాను, రు. 8,700 ఋణాల రూపంలోను యివ్వబడతాయి.

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు.

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకార శాఖద్వారా అమలు జరుప బడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాలను అమలు జరపడంలో తెలియవచ్చినలోటు పాట్లను పరిశీలించడానికి, సూత్రవిధానాలను రూపొందించటానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏవైనాఉంటే వాటిని సరిదిద్దుకొనే టందుకు మార్గాలను సూచించడానికి యీ ప్రత్యేక విభాగం కృషి చేస్తుంది. 1957—58 లో యీ పథకం అమలు జరప బడింది. గణాంక వివరాల సేకరణ, సంకలనానికి సంబంధించిన పనిని నిర్వహించుటకుగాను జిల్లాలలో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించడం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958—59 లో కొనసాగించబడింది.

జిల్లాలలో పని చేస్తున్న సిబ్బందికి సూచనలు యివ్వడానికి, వారిపై అజమాయిషీ వహించడానికిగాను 1959—60 లో రిజిస్ట్రారు కార్యాలయంలో

డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, యిద్దరు జవానులతోకూడిన సిబ్బందిని నియమించడానికి, క్రొత్త సర్కిళ్లకుగాను 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలుకు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించడానికి ప్రతిపాదింప బడింది, క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పరచుటకు తగిన కార్య విధానాన్ని రూపొందించటానికిగాను సహకారశాఖలో పరిశీలన, పరిశోధన ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. మొదట యీ విభాగం కోసం ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లను, ముగ్గురు జవానులను నియమించటానికి ప్రతిపాదింప బడింది. పై కార్యక్రమాన్ని అమలు జరపడం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.34 లక్ష ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద ప్రచారం మొదలైన వాటిక్రింద అయ్యే ఖర్చులకుగాను ప్రత్యేకించబడింది. మిగత రు. 1.36 లక్షల మొత్తంలో రు. 9,087 లు యీ జిల్లాలో నియమించ బడే సిబ్బంది క్రింద అయ్యే ఖర్చుకుగాను ప్రత్యేకించ బడినాయి.

## సహకార సంఘాల సభ్యులు. పంచాయితీదారులు మొదలైన వారికి శిక్షణ

అఖిల భారత సహకార సంఘంద్వారా భారత ప్రభుత్వంచే ప్రారంభించబడిన పథకం పద్ధతుల్లోనే యీ పథకం కూడ రూపొందించ బడింది. సహకార సూత్రాలను గురించి, నిర్వహణా విధానంగురించి గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు మూడు రోజులపాటు, పంచాయితీ దారులకు ఒక వారం రోజులపాటు, సంఘాల నిర్వాహకులకు, జీతం చెల్లింపై పనిచేసే ఉద్యోగులకు 5 లేక 6 వారాల పాటు శిక్షణ యివ్వటానికి యీ పథకం కింద ఉద్దేశింప బడింది. ఈ జిల్లాలో 1,000 మంది సహకార సంఘాల సభ్యులకు, 300 మంది పంచాయతీదార్లకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ యివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 5,856 లు కేటాయించ బడినాయి.

## సహకార వ్యవసాయం.

ఈ పథకం క్రింద భూముల్లేని వ్యవసాయ కూలీలను, సహకార వ్యవసాయ సంఘాలను స్థాపించడం ద్వారా వ్యవసాయంలో స్థిరపడేటట్టుచేసి వారికి పునరావాసం కల్పించటానికి, వాటా మూలధనం క్రింద, ఎద్దులను కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద, భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసి అభివృద్ధి పరచడానికి అయ్యే ఖర్చు క్రింద, వ్యవసాయ పనిముట్లను మొదలయిన వాటిని కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద ఋణాలు, గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రు. 0.88 లక్ష-మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించ బడినాయి. ఇందులో రు. 0.28 లక్ష సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించటం కోసం హెడ్ ఆఫీసులో నియమించ బడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద వినియోగించ బడుతుంది. మిగత మొత్తంలో రు. 8,500 లు యీ జిల్లాకు ప్రత్యేకించ బడినాయి. ఇందులో రు. 2,000లు యింతకుముందు స్థాపించబడిన సంఘాల్లో నియమించబడిన సిబంది ఖర్చు కింద, రు. 6,500 ఈ సంవత్సరంలో యీ జిల్లాలో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలకుఆర్థిక సహాయం చేయడానికి వినియోగించ బడతాయి. ఈ జిల్లాలో 1 క్రొత్త సంఘం ఏర్పాటు చేయబడుతుంది. 250 మంది సభ్యులు యీసంఘాల్లో ఉంటారు. ఈ సంవత్సరంలో 500 ఎకరాల భూమి సాగుచేయబడుతుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ
## (స్టేట్‌వేర్ హౌసింగ్ కార్పొరేషన్)

దేశంలో గిడ్డంగి సౌకర్యాల్ని అభివృద్ధి చేయాల్సిన ఆవశ్యకతను గురించి అనేక కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కి చెప్పాయి. పరపతి సంఘాలు, పరపతేతర సంఘాల మధ్య యివి చక్కని సారథ్యం వహించేవిగా ఉంటాయి. ఇందువల్ల భారతప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషను నొకదాన్ని ఏర్పాటు చేశారు. ఇందు కనుగుణంగా రాజ్యగిడ్డంగి కార్పొరేషన్లను తమతమ రాజ్యాలలో స్థాపించ వలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోరబడినాయి. ఈ రాజ్య గిడ్డంగి కార్పొరేషనులు గిడ్డంగుల మండలి ప్రత్యక్ష

పర్యవేక్షణ క్రింద పనిచేస్తాయి. గిడ్డంగులలో సరకులు నిలువ చేయబడినట్లుగా యివ్వబడే రసీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్లుగా పరిగణించబడతాయి. గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువ చేసిన వారికి పై రసీదుల నాధారం చేసికొని బ్యాంకింగు సంస్థలు ఋణాలను యిస్తాయి. 1958—59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఒకటి యీ రాజ్యంలో స్థాపించబడింది. ఈకార్పొరేషను వాటా మూలధనం క్రింద రాజ్యప్రభుత్వం రు. 2.50 లక్షల మొత్తం యిచ్చింది. ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద యింకా ఎక్కువ డబ్బు సమకూర్చటంకోసం ఆంధ్ర ప్రజానీకలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రజానీకలో రు. 5 లక్షలు ఈ సంవత్సరంలో కేటాయించ బడినాయి. ఈ జిల్లాలోని రైతులకుకూడ యీ పథకం క్రింద లభ్యమయ్యే సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి.

## జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 వ సంవత్సరం మార్చి నెల అంతంనాటికి యీ జిల్లాలో 9 మొదటిదశ బ్లాకులు, ఒక రెండవదశ బ్లాకు, ఒక సామాజికాభివృద్ధి బ్లాకు రెండు ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి. వీటి వైశాల్యం 3384.90 చదరపు మైళ్లు. జనాభా 7,99,065; ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 869. భారత ప్రభుత్వంవారి నిర్ణయానుసారం 1959 సంవత్సరం ఏప్రిల్ నెల నుండి ఏర్పాటుచేయబడే ప్రతి బ్లాకులోకూడ ప్రత్యేకంగా వ్యవసాయరంగంలో ఒక సంవత్సరంపాటు తీవ్ర కృషి (ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమము) జరిగి ఉండాలి. అదేప్రకారం యీ జిల్లాలోని కొండపి, వలిగండ్ల బ్లాకుల్లో వరుసగా 1—4—58, 2—10—58 తేదీల నుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం మొదలుపెట్టబడింది. 1—4—58 నాటినుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమాన్ని ప్రారంభించిన బ్లాకు 1—4—59 నుండి మొదటిదశ బ్లాకుగా ప్రారంభించబడింది. 2—10—58 నుండి యీ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 2—10—59 నాడు మొదటిదశ బ్లాకుగా రూపొందుతుంది. ఇంతేకాక పొదకలూరు సామాజికాభివృద్ధి బ్లాకు 1—4—1959 తేదీనుండి రెండవదశ

బ్లాకుగా రూపొందింది. 1959—60 లో యీ రాజ్యానికి36 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు1—4—59 నాడు, మిగతావి 2—10—1959 నాడు ప్రారంభించబడినాయి. ఇందులో ఆత్మకూరు, పొదిలి బ్లాకులు యీ జిల్లాలో ఉన్నాయి. ఇవి వరుసగా 1—4—1959 మరియు 2—10—1959 తేదీలలో ప్రారంభించబడినాయి. ఈ విధంగా 1—4—1959 నాటికి యీ జిల్లాలో 10 మొదటిదశ బ్లాకులు, 2 రెండవదశ బ్లాకులు, 2 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామూహికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో ఋణాల పద్దుక్రింద రు. 6,20,600లు, గ్రాంట్లు పద్దుక్రింద రు. 12,22,900లు, మొత్తం రు. 18,43,500లు కేటాయించ బడినాయి.

1—4—1959 నాటికి యీ జిల్లాలో ఉన్న బ్లాకులను చూపే పటం ప్రక్కపుటలో యివ్వబడింది.



నెల్లూరు జిల్లా
1-4-59 తేది నాటికి ఉన్న
సామాజికాభివృద్ధి ప్రాంతాలు
బంగాళాఖాతము
చిత్తూరు జిల్లా
మద్రాసు రాజ్యము
సూచన
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
బ్లాకు సరిహద్దు
బ్లాకు కేంద్రము
మొదటి దశ బ్లాకులు
రెండవ దశ బ్లాకులు
ప్రి. ఎక్స్‌టెన్షన్ బ్లాకులు

# పంచాయితీలను పటిష్ఠం చేయడం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో. జిల్లాస్థాయిలో జిల్లా పంచాయితీ ఆఫీసరును, రెవెన్యూ డివిజను స్థాయిలో డివిజనల్ పంచాయితీ ఆఫీసరును, తాలుకా స్థాయిలో బ్లాకు ప్రాంతాలను మినహాయించి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు విస్తరణాధికార్లను నియమించడం, ఆ జిల్లా ఆఫీసర్ల కార్యాలయాలలో అదనపు సిబ్బంది నియమించడం ద్వారా 1958—59 సంవత్సరంలో పంచాయితీ పరిపాలనకు సంబంధించిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బంది వ్యవస్థ పునర్వ్యవస్థీకరించ బడింది. 1959—60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.120 లక్ష ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0.191 లక్ష పడమర, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాలలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించ బడినాయి. అదనంగా ఖర్చుపెట్టాల్సిన అవసరం ఉండే జిల్లాలకు తిరిగి పంపకం చేసే నిమిత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆదీనంలో 0.524 లక్ష ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షలలో రు. 0.4100 లక్ష 1958—59 సంవత్సరంలో యీ జిల్లాలో నియమించబడిన అదనపుసిబ్బందిని కొనసాగించే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణ పథకం

ఈ పథకంక్రింద సామర్లకోట, రాజేంద్ర నగరులలో ఉన్న రెండు విస్తరణ శిక్షణ కేంద్రాలలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయితీలకు సంబంధించిన ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయితీ ఆఫీసర్లకు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదించబడింది. ఈ శిక్షణ రెండు నెలలపాటు యివ్వబడుతుంది. ఒకసారి 40 మంది ఆఫీసర్లకు శిక్షణ యివ్వబడుతుంది. మొత్తంమీద అన్ని వర్గాలకు చెందిన 390 మంది ఆఫీసర్లకు 1959—60 లో శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది.

ఇందుకుగాను ప్రణాళికలో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు చెందిన ఆఫీసర్లకుకూడ యీ పథకంక్రింద శిక్షణ యివ్వబడుతుంది.

# బహుళార్థ సాధక ప్రాజెక్టు

## నాగార్జునసాగర్ ప్రాజెక్టు

నాగార్జునసాగర్ ప్రాజెక్టుకోసం రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 3,230 లక్షలలో రు. 1099.61 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో ఆనకట్ట, కుడి, ఎడమ కాలువలకు సంబంధించిన పనులకు గాను ఖర్చుపెట్ట బడింది. ఈ ప్రాజెక్టుపని కొనసాగించటం కోసం 1958—59 లో రు. 700 లక్షలు (యిది యిప్పుడు రు. 850 లక్షలకు పెంచ బడింది) కేటాయించ బడినాయి. ఈ మొత్తమంతా ఖర్చు చేయ బడగలదని ఆశింప బడుతున్నది. 1959—60 లో యీ పని కొనసాగింపుకోసం రు. 700 లక్షల మొత్తం కేటాయించ బడింది.

# పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల నిర్వహణకోసం 1959—60 సంవత్సరానికి రు. 3.12 లక్షల మొత్తం కేటాయించ బడింది. వీటి వివరాలు క్రిందయివ్వ బడినాయి:—

| వరుస సంఖ్య | ప్రాజెక్టు పేరు | 1958—59 లో కేటాయింపు. ( ) | కేటాయింపుకు కారణం | నీటిపారుదల జరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1 | రాళ్ళపాడు ప్రాజెక్టు | 0.05 | రెగ్యులేటర్ గేట్లను అమర్చుటకు | 5 000 |
| 2. | నక్కలగండి రిజర్వాయరు | 0.05 | "అడ్జస్ట్‌మెంట్ల"కు | 8.00 |

| | | | | |
|---|---|---|---|---|
| 3, | పాలేరు రిజర్వాయరు | 0.01 | చిన్నతరహాపనులకు | 1,000 |
| 4. | ఉప్పుటేరు దిగువఆనకట్ట | 0 01 | చిన్నతరహాపనులకు | 1.892 |
| 5. | పాడేరునుండి బిట్ర గుంట చెరువుకు సరఫరా కాలువ త్రవ్వకం | 3.00 | పని కొనసాగింపుకు | .... |

# విద్యుచ్ఛక్తి

## మాచ్‌ఖండ్ జల-విద్యుచ్ఛక్తి పథకం
## (బకాయి, క్రొత్తపనులు)

1957—58 సంవత్సరానికి ముందు 17 000 కిలోవాట్ల శక్తిగల 3 విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు (జనరేటింగ్ యూనిట్లు) పనిచేయుడం ప్రారంభమయింది. 21,250 కిలోవాట్ల శక్తిగల మిగత రెండు ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడంకూడ 1957_58 లోనే ప్రారంభించ బడింది. 21,250 కిలోవాట్ల శక్తిఉండే ఆరవ ఉత్పాదక యంత్రంతోపాటు పై రెండు యంత్రాలుకూడ 1958_59 లో పనిచేయడం ప్రారంభమవుతుందని మొదట ఆశించ బడింది. కాని మాచ్‌కండ్ వద్ద జరిగిన సమ్మె మూలంగా 21,250 కిలో వాట్ల శక్తిగల నాలుగవ ఉత్పాదక యంత్రం మాత్రం 1959 జనవరి లో పని చేయడం ప్రారంభమయింది. అయిదవ ఉత్పాదక యంత్రం 1959—60 లో పనిచేయడం ప్రారంభమవుతుందని ఆశించ బడుతున్నది. ఇతర కొదువ పనులతో పాటు ఆరవ ఉత్పాదక యంత్రాన్ని నెలకొల్పడానికి సంబంధించిన పనికూడ నాలుగవ అయిదవ ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడానికి సంబంధించిన పనితోపాటు ఒకే సారి మొదలుపెట్ట బడింది. 1959—60 సంవత్సరానికి చేయబడిన రు. 79.07 లక్షల మొత్తం కేటాయింపులో యీ జిల్లావాటా రు. 3.25 లక్షలు. ఈ కేంద్రం యిప్పుడు పూర్వపు ఆంధ్ర రాజ్యంలోని జిల్లాలయిన శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నది.

### ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం

ప్రథమ దశక్రింద ఒక్కొక్కటి 60,000 కిలోవాట్ల శక్తిఉండే రెండు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడం ద్వారా సీలేరునది ఎగువ భాగంలో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి ఈ పథకంక్రింద ఉద్దేశించ బడింది. ఈ పథకానికి సంబంధించిన సవివరమైన పరిశీలనలు జరప బడినాయి. క్యాంపు లను నెలకొల్పడానికి, రవాణా సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి సంబంధించిన ప్రాథమిక చర్యలు అమలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం యీ పథకానికి సంబంధించిన పనిని ప్రారంభించడానికి ప్రతిపాదింప బడింది. 1959—60 సంవత్సరానికి కేటాయించ బడిన రు. 73.00 లక్షల మొత్తం క్యాంపులను నిర్మించడం, ఆనకట్టకు పునాదులను త్రవ్వడం, మట్టిగట్లను నిర్మించడం మొదలయిన సివిలుపనులకు గాను ముఖ్యంగా వినియోగించ బడుతుంది. ఇందులో యీ జిల్లా వాటాగా రు. 10.43 లక్షల మొత్తం ప్రత్యేకించ బడింది.

### గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయ టమేగాక నాగార్జునసాగరు ప్రాజెక్టు పనులకు, గరివిడి ఫెర్రోమాంగనీసు ఫ్యాక్టరీ మొదలయిన పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుత్ సరఫరాలను విస్తరింపచేయడం, రు. 10లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణ పథకాలు అమలు పరచటం జరుగుతుంది. ఆంధ్ర ప్రాంతంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే నిమిత్తం 1959—60 సంవత్సరానికి రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 8.0 లక్షల మొత్తం యీ జిల్లాకు కేటా యించబడింది. 8 గ్రామాలు విద్యుతీకరింపబడతాయి.

## పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు

### గూడూరు లోని ప్రభుత్వ సిరామిక్ ఫ్యాక్టరీ విస్తరణ

గూడూరులో ఉన్న ప్రభుత్వ సిరామిక్ ఫ్యాక్టరీ ప్రస్తుతం పింగాణి సామాన్లను, శ్యానిటరీ పనులకు కావలసిన సామాన్లను తయారు చేస్తున్నది.

ఈ ఫ్యాక్టరీ స్థిరంగా పని చేయటానికి వీలుకల్పించే నిమిత్తం ఎలక్ట్రిక్ ప్రోసి లైన ఇన్సులేటర్లను అదనంగా ఉత్పత్తి చేసేటందుకు అనువుగా యీ ఫ్యాక్టరీని రెండవ ప్రణాళికా కాలంలో రు. 12.60 లక్షల మొత్తం వ్యయంతో విస్తరింప చేయటానికి ప్రతిపాదింప బడింది. అదనపు భవనాల నిర్మాణం పూర్తి చేయ బడింది. "టన్నల్ కిల్న్" కూడ పనిచేయడం ప్రారంభమయింది. మొదటి మూడు సంవత్సరాల్లో రు. 7.17 లక్షల మొత్తం ఖర్చు పెట్ట బడింది. ఈ సంవత్సరం రు. 5.50 లక్షల మొత్తం కేటాయించ బడింది. విదేశాలనుంచి దిగుమతి చేసికోబడి గతసంవత్సరం నెలకొల్పబడిన "ప్లాంటు"కు అయ్యే ఖరీ ఖరీదును చెల్లించడానికి, విస్తరింప చేయబడి 1—4—1959 నుండి ఉత్పత్తిని ప్రారంభించిన ఫ్యాక్టరీ నిర్వహణ ఖర్చులకుగాను పై డబ్బు వినియోగించ బడుతుంది.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## చిన్నతరహా పరిశ్రమలు

### వడ్రంగానికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలను స్థాపించడం

వడ్రంగంలో స్థిరపడిన పనివారికి మేలురకం పరికరాలను వాడటం లోను, మేలురకంపద్ధతుల్లో నాణ్యమైన కుర్చీలు, బల్లలు మొదలగు వాటిని తయారుచేయడంలోను శిక్షణ యిచ్చేటందుకుగాను 1956—57 లో శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులలో వడ్రంగంపనికి సంబంధించిన 6 ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు స్థాపించబడినాయి. వాటికి నిర్మించ బడిన శాశ్వతభవనాలలో యీ కేంద్రాలుపనిచేస్తున్నాయి. ప్రతి కేంద్రంలోను ఏటా 12 మందికి శిక్షణ యివ్వడానికి ఏర్పాటు చేయబడింది. శిక్షణ కాలంలో ఒక్కొక్క అభ్యర్థికి నెలకు రు. 30/-ల చొప్పున స్టయిఫండు యివ్వబడుతుంది. మొదటి మూడు సంవత్సరాలకాలంలోను పై 6 కేంద్రాలలో మూడు జట్లుగా 173 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది.

ఈ కేంద్రాలను కొనసాగించటానికి, 72 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటానికిగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.95 లక్ష కేటాయించ

బడింది. ఇందులో రు. 0.16 లక్ష యీ జిల్లాలో కేంద్రాన్ని కొనసాగించ డానికి, 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికిగాను కేటాయించబడింది.

## కమ్మరంపనికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలను స్థాపించడం

కమ్మరంపనిలో స్థిరపడిన పనివారికి మేలురకం పద్ధతుల్లో వ్యవసాయ పరికరాలు, చేతిపనిముట్లు మొదలయిన వాటిని మరమ్మతు చేయడంలోను, తయారుచేయడంలోను శిక్షణ యివ్వడంకోసం 1956—57 లో కమ్మరంపనికి సంబంధించిన ఆరు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులో స్థాపించబడినాయి. వాటికై నిర్మించబడిన శాశ్వత భవనాలలో యీ కేంద్రాలు యిప్పుడు పనిచేస్తున్నాయి. ప్రతి కేంద్రంలోను ఏటా 20 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. వీరి కొక్కొక్కరికి నెలకు రు. 30/- లు స్టయిఫండుగా యివ్వబడతాయి. శిక్షణ పూర్తయింతర్వాత చిన్నతరహా తయారీకేంద్రాలను ఏర్పాటు చేసుకోవటానికి గాని లేక పారిశ్రామిక సహకార సంఘాలను ఏర్పాటు చేసుకోవడానికిగాని వీరికి తగిన ప్రోత్సాహం యివ్వబడుతుంది. మూడు జట్లుగా పై ఆరు కేంద్రాలలో యింతవరకు 175 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు.

ఈ కేంద్రాలు కొనసాగించడానికి, 72 మంది అభ్యర్థులతో కూడిన యింకో జట్టుకు శిక్షణ ఇవ్వటంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.89 లక్ష కేటాయించబడింది, ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాలోని కేంద్రాన్ని కొనసాగించటానికి 12 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చేటందుకుగాను ప్రత్యేకించబడింది.

## గూడూరులో సైన్సుకు సంబంధించిన గాజుపరికరాల తయారి

సైంటిఫిక్ మరియు లేబరేటరి గాజుపరికరాల తయారీకిగాను ఉత్పత్తి-శిక్షణ కేంద్రమొకటి 1956—57 లో గూడూరులోని ప్రభుత్వ సెరామిక్ ఇనిస్టిట్యూట్‌లో ప్రారంభించబడింది. ఈ కేంద్రంలో ఏటా 10 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటానికి సౌకర్యాలున్నాయి. శిక్షణ పొందేవారికి నెలకు రు. 25/-లు స్టయిఫండుగా యివ్వబడుతుంది.

దిగుమతి చేసికోవలసిన యంత్రాలు, పరికరాలను ఖరీదుచేయుటానికి, యీ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను 1959—60లో రు. 0.28 లక్ష కేటాయించబడింది. ఇందుకుకావలిసిన విదేశీ మారకద్రవ్యం యిటీవలే లభ్యం చేయబడింది. ఈ సంవత్సరంలో కూడ 10 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ కేంద్రంవల్ల రు. 6,000/-లు వస్తుందని ఆశించబడుతున్నది.

## గూడూరులో ఎనామిల్ వస్తువుల తయారీకి సంబంధించిన ఉత్పత్తి శిక్షణ కేంద్రం.

ఎనామిల్ సైన్ బోర్డులతోసహా వివిధ రకాల ఎనామిల్ వస్తువులను తయారు చేయటంలో ఏటా 10 మంది అభ్యర్థులకు యీ పథకం క్రింద శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడి ది వీరికి నెలకు రు 25/- ల స్టయిఫండు యివ్వబడుతుంది. 1958—59 లో నిర్మించబడిన శాశ్వత భవనాల్లో యీ కేంద్రం గూడూరులో స్థాపించబడింది ఈ యూనిట్టుకు కావలసిన పరికరాలు, యంత్రాలు చాల వరకు అందచేసుకోబడి ౦ యి.

ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.88 లక్ష 10 మంది పనివారికి శిక్షణ యివ్వటానికి, దిగుమతి చేసికోవలసిన యంత్రాలను ఖరీదు చేయటానికిగాను కేటాయించ బడింది. ఇందుకు కావలసిన విదేశీ మారక ద్రవ్యం యిటీవలే లభ్యం చేయబడింది. ఈ కేంద్రంవల్ల రు. 5,000 లు రాబడిఉంటుందని ఆశించబడినది.

## గూడూరులో లోలాస్ సెరామిక్ వస్తువులు, రేడియో విడిభాగాల తయారి.

గూడూరులో ని సెరామిక్ ఫ్యాక్టరీ ఆవరణలో లోలాస్ సెరామిక్ వస్తువులను, రేడియో విభాగాలను తయారు చేసే యూనిట్టు నొకదాన్ని స్థాపించుటకు యీ పథకం ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 0.87 లక్ష భవనాల నిర్మాణానికి, యంత్రాలు, పరికరాల కొనుగోలుకుగాను కేటాయించ బడింది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలు

ఈ పథకంక్రింద పరిశ్రమలకు రాజ్య ప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలుగా రు. 13.11 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యివ్వబడింది. ఈ సంవత్సరంలో యింక రు. 7 లక్షల మొత్తం పారిశ్రామికులకు ఋణాలుగా ఇవ్వబడుతుంది ఈ జిల్లాలోని పారిశ్రామికులు కూడ ఈ పథకంవల్ల ప్రయోజనం పొందుతారు.

## పరిశ్రమలశాఖ డైరెక్టరేటును, జిల్లాల సిబ్బందిని పటిష్ఠం చేయటం

రెండవ ప్రణాళికాకాలంలో ఎక్కువయిపోయిన పనిని నిర్వహించేటందుకుగాను రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 7.95 లక్షల వ్యయంతో రాజ్యస్థాయిలోను, జిల్లాస్థాయిలోను పరిశ్రమలశాఖను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదించబడింది. మొదటి 3 సంవత్సరాలకాలంలోను అదనపు సిబ్బంది (సాంకేతిక మరియు మినిస్టీరియల్) సిబ్బంది రు. 3.45 లక్షల వ్యయంతో నియమించబడింది. ఇంతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి, ఇంకా కొంత అదనపు సిబ్బందిని నియమించటానికిగాను ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాలు

బ్లాకుప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులసరఫరా

ప్రతిపాదింపబడిన పథకాలు త్వరితంగాను సమర్థవంతంగాను అమలు పరచబడాలంటే అందుకు సంబంధించిన పరిశ్రమల శాఖాధికార్లు తరచు పర్యవేక్షణ జరుపుతూ సాంకేతిక సహాయం అందజేస్తుండాలి. ఈ అధికార్లు త్వర

త్వరగా పర్యటనలను జరిపేటందుకు వీలుగా వీరికి జీపులను సరఫరా చేయటం అవసరం. 1958—59 లో ఆంధ్రలోని పరిశ్రమల వాణిజ్యశాఖ డైరెక్టర్లకు జీపులు యివ్వబడినాయి. ఈ జీపుల నిర్వహణకోసం ఈ సంవత్సరానికి రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉంది.

## హస్తకళలు.

### వెదురు, పేము బుట్టల అల్లకానికి సంబంధించిన ఉత్పత్తి శిక్షణ కేంద్రం.

వెదురు వస్తువులను, బుట్టలను మేలురకం పద్ధతులలో తయారు చేయటంలో ప్రతి కేంద్రంలోను 10 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చుటకుగాను నెల్లూరులోను, కడప జిల్లాలోని కోడూరులోను, విశాఖపట్టణం జిల్లాలోని తుమ్మపాలలోను 3 కేంద్రాలు స్థాపించ బడినాయి. 1957—58 లో 57 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది. ఈ కేంద్రాలు సహకార సంఘాలుగా మార్చబడినాయి. ఈ సంవత్సరం శిక్షణ కార్యక్రమం నిలిపివేయబడింది. వాటా మూలధనం, నిర్వహణ మూలధనం క్రింద యీ సంఘాలకు ఆర్థికసహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.18 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.06 లక్ష యీ జిల్లాలోని కేంద్రంకోసం వినియోగించ బడుతుంది.

## క్రొత్త పథకాలు.

హస్తకళలకు సంబంధించిన క్రింది పథకాలు యీ సంవత్సరంలో అమలు పరచ బడతాయి. ఆంధ్ర ప్రాంతంలోని అన్ని జిల్లాలకు కూడ యీ పథకాల క్రింద లాభం చేకూరుతుంది.

| పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూపాయలు, లక్షలలో.) |
|---|---|
| హస్తకళలలో ఉపయోగించటానికిగాను దేవాలయాలలోని డిజైనులను కాపీచేయటం. .... | 0.05 |

2. అక్కడక్కడా ఉండి ఒక సహకార సంఘం క్రిందకు తీసుకురావటానికి వీలుగా ఉండనట్టి పనివారలకు ఋణాలు గ్రాంట్లు మంజూరు చేయుటం .... 0.05

## ఉదయగిరిలో కొయ్య చెంచాల తయారీకి శిక్షణ సౌకర్యాలు; సహకార కేంద్రం స్థాపించటం.

ఈ జిల్లాలోని ఉదయగిరిలో కొయ్య చెంచాలు తయారు చేయటంలో శిక్షణ యిచ్చుటకుగాను సౌకర్యాలను కలుగచేయటానికి. యీ చెంచాల తయారీకిగాను ఒక సహకార కేంద్రాన్ని స్థాపించుటకుగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0 70 లక్ష కేటాయించ బడింది.

## గ్రామీణ పరిశ్రమలు

## బెల్లం, ఖాండసారీ పరిశ్రమలు.

ఈ పథకం క్రింద రైతులకు మేలు రకంపనిముట్లను కొనుక్కోవటానికిగాను వడ్డీ లేకుండా ఋణాలు యివ్వబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాల కాలంలో వసూలు చేయబడతాయి. ఇంతేకాక మేలురకం బెల్లం, ఖండసారీలను తయారు చేయటం గురించి ప్రదర్శన పూర్వకంగా వివరింప బడుతుంది. అనకాపల్లి, చోడవరం రామచంద్రాపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో యీ పథకం మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో (1955) అమలు పరచ బడింది. ఇందుకుగాను ప్రత్యేక ఫీల్డు సిబ్బంది నియమించ బడింది. మేలురకం బెల్లం, ఖాండసారి తయారు చేయటంలో వీరు శిక్షణ పొందారు. 1956—57, 57—58 లలో యీ పథకం కొనసాగింప బడింది. అయితే 1958—59 లో యిది అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ తాలూకాకు, పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకు తాలూకాకు, కృష్ణా జిల్లాలోని దివి తాలూకాకు, గుంటూరు జిల్లాలోని రేపల్లె తాలూకాకు, చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి తాలూకాకు విస్తరింప చేయుటానికి. ఇంతేకాక ప్రస్తుతము యీ పథకం అమలులో ఉన్న ప్రాంతాలలో కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఈ

పథకం క్రింద కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయటం ద్వారా యిప్పుడున్న 30,000 ఎకరాలే కాక అదనంగా 32,650 ఎకరాలమేర యీ పథకం క్రిందకు తీసుకురా బడుతుంది. ప్రస్తుతం యీ పథకం పరిశ్రమల శాఖవారి నియంత్రణలో అమలుపరచ బడుతున్నది. ఇపుడు దీన్ని ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు క్రిందకు మార్చడానికి ప్రతిపాదింప బడింది. ఈ బోర్డు 1958 నవంబరు లో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కోసం రు. 6·00 లక్షలు కేటాయించ బడినాయి.

## కుటీర పరిశ్రమలకు ఋణాలు సబ్సిడీల నివ్వటానికి సంబంధించిన 1948 సంవత్సరపు నిబంధనల క్రింద ఋణాలు.

వడ్రంగం, నేతపని, కమ్మరం మొదలయిన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలలో పనిచేస్తున్న పని వారికి సహాయం చేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాలకాలంలో రు. 1.64 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. 1958—59 లో యీ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2 00 లక్షల వరకు ఋణాలు మంజూరు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని పనివారికి యీ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## పారిశ్రామిక సహకార సంఘాలు.

గ్రామీణ పరిశ్రమలకు సుస్థిరత్వంచే కూర్చడం వాటి ఉత్పత్తి విధానాల్ని మెరగు పరచడం ద్వారా అధికోత్పత్తిని సాధించేటట్లు చేయడమే యీ పథకం యొక్క ఉద్దేశం. ఇందుకుగాను సహకార సంఘాల ద్వారా దంపుడు బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు 10 కేంద్రాలను ప్రారంభించటం, కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వాహణ మూలధనం, యితర ఖర్చుల క్రింద గ్రాంట్లు యివ్వటం, మేలురకం పరికరాలు కొనుక్కోవటానికి గాను గుంటూరు కమ్మరం సహకార సంఘం వారికి ఆర్థిక సహాయం చేయటం, పరికరాలు మొదలయినవి కొనుక్కోవటానికిగాను కుటీర పరిశ్రమల సహకార సంఘము లకు సబ్సిడీలు యివ్వటంవంటి పథకాలు రూపొందించ బడినాయి. ఇందుకు

గాను యీ పథకంక్రింద ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. ఈ పథకం కొనసాగింపుకోసం ఈ సంవత్సరానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్వర్యంక్రిందకు యీ పథకాన్ని మార్చటానికి కూడ ప్రతిపాదింపబడింది.

# చేనేతపరిశ్రమ

## సహకారసంఘాలకువాటామూలధనము

## నిర్వహణమూలధనంక్రింద ఋణాలు

చేనేత సహకార సంఘాలలో వాటాలు తీసికొని అందులో సభ్యులుగా అయ్యేటందుకు వీలు కల్పించే నిమిత్తం చేనేత పనివారికి ఋణాలను యివ్వటానికి యీ పథకంక్రింద ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో యీ పథకమునకుగాను రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష వాటా మూలధనం ఋణాలు యివ్వటంకోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 200 క్రొత్త మగ్గాలు సహకార సంఘాల క్రిందకు తీసుకు రాబడతాయని, 20 లక్షల గజా గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడింది.

## ఆంధ్ర చేనేత సహకార సంఘాలయొక్క మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

ఇంకా ఎక్కువగా విక్రయశాలలను ప్రారంభించటంద్వారాను, చేనేత గుడ్డలను గురించి తీవ్ర ప్రచారము చేయటంద్వారాను ఆంధ్ర చేనేత సహకార సంఘంవారి మార్కెటింగు వ్యవస్థను పటిష్ఠం చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఈ పథకమునకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.31 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 0.27 లక్ష యీ జిల్లాలో అదనంగా 3 విక్రయశాలలు ప్రారంభించటానికిగాను వినియోగించబడుతుంది ఈ సంవత్సరంలో విక్రయశాలలద్వారా 10 లక్షలగజాలగుడ్డ అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, వ్యవస్థవ్యయాలు

మంచిరకం చేనేత గుడ్డలను ప్రజారంజకంగా ఉండే నమూనాలలో ఉత్పత్తి చేయుటకుగాను చేనేత పరిశ్రమయొక్క సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి పరచటానికి యీ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో యీ పథకం అమలు పరచబడింది స్టాండర్డురీడ్లు, వార్పింగు యంత్రాలు మొదలైన మేలురకం పరికరాలు చేనేత పనివారికి సరఫరా చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఆంధ్రకుగాను ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.52 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. చేనేత పనివారికి 60 స్టాండర్డు రీడ్లను, నాలుగు వార్పింగు యంత్రాలను, 50 స్లేలను, ఒక ప్రెస్ మెషిన్‌ను సరఫరా చేయటానికి, గుడ్డల నాణ్యతను సరిచూడడానికి నియమించబడిన ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్లను కొనసాగించటానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## ముదరా

చేనేతగుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా చేనేతగుడ్డ ఉత్పత్తిని ఎక్కువ చేసేటందుకుగాను ఆంధ్ర చేనేత సహకార సంఘం యొక్క విక్రయశాలలద్వారా ప్రాథమిక చేనేత సహకార సంఘాలద్వారా జరిగేచేనేత గుడ్డ అమ్మకంపై ముదరా యివ్వబడుతున్నది. సామాన్యంగా యీ ముదరా రూపాయకు 6 నయాపైసలు చొప్పున యివ్వబడుతుంది. సరుకు మిగిలిపోయి ఉన్న సందర్భాల్లో సంఘాలు తమదగ్గర నిలువఉండిపోయిన సరుకును అమ్మేటందుకుగాను అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడ యివ్వబడుతుంది. ఈ పథకంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష యీ జిల్లాలో ముదరా యిచ్చుటకుగాను వినియోగించబడుతుంది.

## నేతపని వారికి యిళ్ళకాలనీలు.

నేతపనివారికి నివాస గృహాలను నిర్మించటంద్వారా వారి నివాసపరిస్థితులను అభివృద్ధి చేయటానికి, ఆరోగ్యకరమయిన, అనుకూలమయిన పరిసరాలలో వారు తమ పరిశ్రమను కొనసాగించటానికి వీలుకల్పించి టందుకు

యీ పథకం ఉద్దేశించబడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 5.04 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతపు గృహ వసతి పథకాలకోసం యీ పథకం క్రింద కేటాయించబడింది. ఇందులో రు. 1.21 లక్షల మొత్తం నెల్లూరు జిల్లాలో క్రింది పనుల నిర్వహణ నిమిత్తం ప్రత్యేకించబడింది.

| | గృహావసతి పథకం పేరు | ఇళ్ళ సంఖ్య |
|---|---|---|
| 1. | అలగానిపాడు | 40 |
| 2. | స్టోన్ హౌస్ పేట | 57 |
| | | 97 |

# రోడ్లు

## ప్రభుత్వ రోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతానికి 1959—60 సంవత్సరానికి యీ పథకంకోసం రు. 41.69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.601 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60 సంవత్సరంలో కేటాయించబడిన మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| 1 | దేగపూడి-సైదాపురం రోడ్డులో వంక మీద మై. 0/7, 6/5, 7/1 ల వద్ద వంతెనల నిర్మాణం .... | 0.001 |
| 2. | సీతాపురం నుండి కడప జిల్లాలోని పోరుమామిళ్ళకు రోడ్డు పొడిగించటం (నెల్లూరు జిల్లా) .... | 2.500 |

| | | |
|---|---|---|
| 3. | దేగపూడి-సైదాపురం రోడుమీద 0/0 — 11/6 మైళ్ళమధ్య తారు వేయటం.... | 0·400 |
| 4. | రాపూరు-వెంకటగిరి రోడ్డులో 0/0-16/6 మైళ్ళమధ్య యిరుకుగా ఉన్న రోడ్డు ప్రాంతాన్ని వెడల్పు చేయటం .... | 0·200 |
| 5. | రాపూరు-వెంకటగిరి రోడ్డుమీద చిన్న వంతెనలను, కల్వర్టులను నిర్మించటం. | 0.250 |
| 6. | నెల్లూరు-బొంబాయిరోడ్డులో 2/4-6/0 మైళ్ళ మధ్య కల్వర్టులను వెడల్పు చేయుటం .... | 0.250 |

## ప్రభుత్వం స్వాధీనంచేసికొన్న రోడ్లస్థాయిని పెంచటం

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వంవారిచే యింతకు ముందు స్వాధీనం చేసి కొనబడిన జిల్లాబోర్డు రోడ్లస్థాయిని పెంచటంకోసం 1959—60 ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.40 లక్షల మొత్తం యీ జిల్లాలో క్రింది రోడ్ల స్థాయిని పెంచటంకోసం ప్రత్యేకించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించ బడిన మొత్తం. (రు. లక్షలలో) |
|---|---|---|
| 1. | గూడూరు—దుగ్గరాజపట్నం రోడ్డుమీద 4/5-25/0 మైళ్ళమధ్య వంతెనలను, కల్వర్టులను వెడల్పుచేయటం .... | 0.20 |
| 2. | రాపూరు-వెంకటగిరి రోడ్డు మీదచిన్న వంతెనలను, కల్వర్టులను నిర్మించటం. | 0.40 |
| 3. | వేగురుమీదుగా ఉన్న కవ్వూరు-ముదివర్తి రోడ్డు మీద తగుచీలలో తారు వేయటం .... | 0 20 |

| | | |
|---|---|---|
| 4. | వేగూరు మీదుగా ఉన్న కొవ్వూరు-ముదివర్తి రోడ్డుమీద చిన్న వంతెనలను కల్వర్టులనునిర్మించటం .... | 0.10 |
| 5. | వేగూరు మీదుగా ఉన్న కొవ్వూరు-ముదివర్తి రోడ్డు మీద వంతెనలను "హైవేస్ "స్థాయికి పెంచటం .... | 0.10 |
| 6. | రాపూరు–వెంకటగిరి రోడ్డు 0/0-16/6 మైళ్ళమధ్య యిరుకుగా ఉన్న రోడ్డు భాగాలను వెడల్పు చేయుటం .... | 0.10 |
| 7 | మైలు 16/6 వద్ద రాపూరు—వెంకటగిరి రోడ్డులో తిరిగి కంకర వేయుటం .... | 0.60 |
| 8. | నెల్లూరు-కోవూరు రోడ్డులో మై. 24/0 15/0 మైళ్ళమధ్య తారువేయటం .... | 0.30 |
| 9. | బుచ్చిరెడ్డిపాలెం–కడవలూరు-అటుకూరు రోడ్డుకు తారువేయుటం .... | 0.50 |
| 10. | నెల్లూరు-కోవూరు రోడ్డును 2/1-13/6 మైళ్ళమధ్య "హైవేస్" స్థాయికి పెంచటం .... | 0.50 |
| 11. | బుచ్చిరెడ్డిపాలెం—ఊటుకూరు రోడ్డును "హైవేస్" స్థాయికి పెంచటం .... | 0.40 |

ఇంతేకాక యీ పథకంక్రింద యీ జిల్లాలోని క్రింది జిల్లాబోర్డు రోడ్లను కూడ స్వాధీనం చేసికోవటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు డబ్బు కేటాయింపు అవసరంలేదు.

| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు, మైళ్ళలో మై—ఫ—అ |
|---|---|---|
| 1. | [illegible] రోడ్డు | 17—0—0 |
| 2. | కావలి— [illegible] రోడ్డు పి. ఆర్. డి. [illegible] | 7—0—360 |
| 3. | కనుమూరు నుండి జి. ఎన్. టి. రోడ్డు మై. [illegible]7/1 వరకు పి. ఆర్. 0—0—0 నుండి 5—4—0 వరకు | 5—4—0 |

## రోడ్ల ప్రక్కన చెట్లు.

రోడ్ల కిరుప్రైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959-60 ప్రణాళికలో రు.15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను పూర్తి చేసే నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంటు యివ్వటం కోసం పై డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 1.60 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఇతర రోడ్లు (క్రొత్త పనులు.)

పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను చేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాబోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగతా సగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు యివ్వటం కోసం 1959-60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.10 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామ ప్రణాళికలతో రోడ్లు.

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్లు యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిశ్చయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగిలిన సగం ఖర్చుయీ రోడ్లవల్ల ప్రయోజనం పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు. 1.398 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు. 9.457 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుససంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగింపు పథకాలు** | |
| 1. | 1956—57లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| | (ఎ) స్థానిక సంస్థలు (5 పాఠశాలలు) ... | 0.058 |
| 2. | 1957—58 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన ఉపాధ్యాయులు. | |
| | (ఎ) స్థానిక సంస్థలు (33 పాఠశాలలు) | 0.360 |
| 3. | 1958—59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు | |

(ఏ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) 0.020

(బి) ఎయిడెడ్ (2 పాఠశాలలు) 0.010

4. 1957—58 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు.

(ఏ) స్థానిక సంస్థలు (14 పాఠశాలలు) .... 0.210

5. 1958—59 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు ....

(ఎ) స్థానిక సంస్థలు (9 పాఠశాలలు)... 0.200

(బి) ఎయిడెడ్ (9 పాఠశాలలు).... 0.030

6. 1957—58లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

(ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ)

(బి) స్థానిక సంస్థలవి (52 పాఠశాలలు)

(సి) ఎయిడెడ్ (1 పాఠశాల)

} 0.006

7. 1958—59 లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

(ఎ) ఎయిడడ్ (5 పాఠశాలలు) ....

(బి) ఎయిడెడ్ (5 పాఠశాలలు) ....

} 0.002

8. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలో పనిచేసే

| | | |
|---|---|---|
| | ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు ... | 3.17 |
| 9. | 1956—57 లో జిల్లాబోర్డులచే స్వాధీనం చేసికోబడిన ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలకు ... | 2.00 |
| 10. | 1956—57 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల, 17 సెక్షనులు) .... | 0.110 |
| | (బి) ఎయిడెడ్‌వి (4 సెక్షనులు) .... | 0.010 |
| 11. | 1957—58 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు | |
| | (ఎ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు 11 సెక్షనులు) .... | 0.170 |
| | (బి) ఎయిడెడ్ (1 పాఠశాల) .... | 0.050 |
| 12. | 1957—58 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ పాఠశాలలకు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి. (ఒక పాఠశాల). | 0.040 |
| 13. | 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు (ప్రభుత్వం వారివి) (ఒక సెక్షను) .... | 0.100 |
| 14. | 1958—59లో ప్రభుత్వ శిక్షణ పాఠశాలల్లో స్థాయి పెంచబడిన హెడ్మాస్టరు పదవులకు (రెండుపదవులకు) .... | 0.010 |

| | | |
|---|---|---|
| 15. | 1956—57 లో సెకండరీ గ్రేడు శిక్షణ విభాగాలుగా మార్చబడిన హైయర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ విభాగాలకు. ... | 0.010 |
| 16. | 1958—59లో కొన్ని ప్రభుత్వశిక్షణ పాఠశాలల్లో నియమించబడిన డ్రాయింగు, హిందీ టీచర్లకు (ఒక ఉపాధ్యాయుడు) .... | 0.010 |
| 17. | 1957—58 సం. లో ఇనస్పెక్టరేటులతో నియమించ బడిన గుమాస్తాలకు, టైపిస్టులకు (నలుగురికి) .... | 0.030 |
| 18. | 1958—59 లో నియమించ బడిన సీనియరు డిప్యూటీ ఇనస్పెక్టరులకు జవానులను కలుపుకుని (7 పదవులు.) .... | 0.120 |
| 19. | మూడవ ఫారం వరకు ఉచిత విద్యను గరపటానికి సంబంధించిన పథకాన్ని అమలు పరచుటకు, ఇనస్పెక్టరేటులలో నియమించ బడిన అప్పరుడివిజను గుమాస్తాలకు (ఇద్దరు గుమాస్తాలకు) .... | 0.030 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 20. | విద్యా వంతులైన నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించటానికి సంబంధించిన పథకం. ... | 1.000 |
| 21. | ప్రాథమిక పాఠశాలలలో అదనంగా ఉపాధ్యాయులను నియమించుటకు (27మంది ఉపాధ్యాయులు.) .... | 0.130 |
| 22. | ప్రాథమిక పాఠశాలలను జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చుటకు. | |

| | | |
|---|---|---|
| | (ఏ) స్థానిక సంస్థలవి (21పాఠశాలలు.) | 0.060 |
| | (బి) ఎయిడెడ్‌వి (7పాఠశాలలు.) | 0.020 |
| 23. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం— హైయ్యరు ఎలిమెంటరీగ్రేడు శిక్షణ పాఠశాలలు (ఒకటి) .... | 0.180 |
| 24. | మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంట్లు (2 పాఠశాలలు) .... | 0.120 |
| 25. | ఎయిడెడ్ హైయరు ఎలిమెంటరీ పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చటం. (ఒక పాఠశాల) .... | 0.060 |
| 26. | 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | |
| | (ఎ) ఎయిడెడ్‌వి (4పాఠశాలలు) .... | ).010 |
| | (బి) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు) .... | 0.370 |
| 27. | ఎయిడెడ్ మాధ్యమిక పాఠశాలల్లో అదనపు తరగతులను ప్రారంభించటం (7 పాఠశాలలు) కాంపెన్‌సేటరీ గ్రాంటు .... | 0.050 |
| 28. | కొవ్వూరు, కనిగిరిలలో బాలికలకుగాను రెండు ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను స్థాపించటం | 0.260 |
| 29. | 1958—59 లో స్థాపించబడిన ప్రాచ్యవిద్యా పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (రెండు పాఠశాలలు) | 0.006 |

| | | |
|---|---|---|
| 30. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... | 0.020 |
| 31. | వెంకటగిరిలోని ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలకు మాడల్ స్కూలు .... | 0.050 |
| 32. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (2 పాఠశాలలు.) .... | 0.010 |
| 33. | జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (1 జీపు) .... | 0.160 |
| 34. | అదనపు జిల్లా విద్యాశాఖాధికారిని నియమించటం (ఒకరు) .... | 0.190 |
| | మొత్తం | 9.457 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 3.64 లక్షల మొ కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొ (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగింపు పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల 9 సెక్షనులు) .... | 0.050 |
| | (బి) ఎయిడెడ్ వి (4 సెక్షనులు, 1 పాఠశాల) | 0.030 |

2 1957—58 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠ శాలలు, అదనపు సెక్షనులు

(ఎ) స్థానిక సంస్థలవి (2 పాఠశాలలు, 1 సెక్షను) .... 0.010

3. 1957—58లో హైయర్ సెకండరీ పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల) 0.020

(బి) ఎయిడెడ్‌వి (2 పాఠశాలలు) 0.030

4. ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలకు .... 0.050

(బి) ఎయిడెడ్ వాటికి .... 0.020

5. హైయర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు.... 0.060

6. సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి .... 0.700

7. 1958—59 లో శిక్షణ కళాశాలలో పునర్వ్యవస్థీకరించబడిన సిబ్బందికి .... 0.040

8. నెల్లూరులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలకు, భవనాలను కలుపుకొని .... 1.300

## క్రొత్త పథకాలు

9. 1958—59 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు

| | | |
|---|---|---|
| (ఎ) స్థానిక సంస్థలవి | .... | 0.10 |
| (బి) ఎయిడెడ్‌వి | .... | 0.050 |
| 10. మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వం వారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచటం, సెకండరీ పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం, నెల్లూరులో స్త్రీలకుగాను ఉన్న ప్రభుత్వ సెకండరీ మరియు శిక్షణ కళాశాలకు అనుబంధించబడిన మోడలు స్కూలు | | 0.030 |
| 11. ఉన్నత పాఠశాలను హైయర్ సెకండరీ పాఠశాలగా మార్చడం | | |
| (ఎ) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | ... | 0.000 |
| 12. కావలిలో విశ్వోదయ బాలికల పాఠశాలలో నృత్య శాస్త్రాన్ని ఐఛ్ఛిక కోర్సుగా ప్రవేశ పెట్టటం | .... | 0.010 |
| 13. ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు | | |
| (ఎ) స్థానిక సంస్థలవి. | ... | 0.100 |
| (బి) ఎయిడెడ్‌వి | .... | 0.200 |
| 14. ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామానులకు, పరికరాలకు గాను గ్రాంట్లు | | |
| (ఎ) స్థానిక సంస్థలకు | ... | 0.100 |
| (బి) ఎయిడెడ్ వాటికి | .... | 0.100 |

| | | |
|---|---|---|
| 15. | ప్రభుత్వ శిక్షణ కళాశాలలను పటిష్ఠం చేయటం. ... | 0.040 |
| 16. | ప్రభుత్వ శిక్షణ కళాశాలలో అదనంగా ట్యూటర్లను, అసిస్టెంటు లెక్చరర్లను నియమించటం... | 0.010 |
| 17. | XI, XII తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. .... | 0.004 |
| 18. | ప్రభుత్వ బాలుర బహుళార్థక హైయర్ సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ డైరెక్టర్ల (వ్యాయామశిక్షకులు) నియామకం (4 పదవులు) | 0.010 |
| | మొత్తం | 3 964 |

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 34.64 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.56 లక్ష క్రింద పథకాలకుగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలల్లోను, శిక్షణ కళాశాలల్లోను అదనపు సిబ్బంది నియామకం .... | 0.01 |

### క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 2. | మూడేళ్ల డిగ్రీ కోర్సును ప్రభుత్వ సహాయం పొందే రెండు ఎయిడెడ్ కళాశాలల్లో ప్రవేశ పెట్టటం .... | 0.55 |
| | మొత్తం | 0.56 |

### ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు. లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయి లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగించ బడుతున్న పథకాలు.** | |
| 1. | ఎన్. సి. సి. ఎ. సి. సి ల విస్తృతికి ... | 0.51 |
| 2. | స్కౌటింగు, గర్ల్‌గైడింగు అభివృద్ధికి .... | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయితీలు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.06 |
| 4. | ఎన్. సి. సి. యూనిట్లుకు ఏరోమాడలింగ్ మరియు షిప్‌మాడలింగ్ పరికరాలను సరఫరా చేయటం .... | 0.01 |
| 5. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.03 |
| 6. | హిందీ ప్రేమికమండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.01 |

| | | | |
|---|---|---|---|
| 7. | యువక సంక్షేమ కార్యక్రమాలకు | .... | 0.01 |
| 8. | నెల్లూరులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలకు అనుబంధించబడిన క్రాఫ్ట్ సెంటరులో శిక్షణ పొందుతున్నవారికి స్టయిఫండ్లు | .... | 0,10 |
| | | మొత్తం | 0.75 |

## గూడూరులో సెరామిక్ ఇన్‌స్టిట్యూట్‌ను అభివృద్ధిపరచటం

గూడూరులోని సిరామిక్ ఇనిస్టిట్యూట్ అభివృద్ధికి గాను రు. 0.82 లక్ష రెండవ ప్రణాళికలో కేటాయించ బడింది. ఇందులో రు. 0.20 లక్ష పరికరాల కొనుగోలుకు గాను 1958—59 లో మంజూరు చేయ బడింది. అయితే యిది ఖర్చుపెట్టటానికి వీలులేక పోయింది. ఈ సంవత్సరం యింకా రు. 0 40 లక్ష పరికరాల కొనుగోలుకు గాను కేటాయించ బడింది.

## గూడూరులో మైనింగ్ ఇన్‌స్టిట్యూట్ స్థాపన

40 మంది అభ్యర్థులను చేర్చుకొనేటందుకు వీలుండే విధంగా 1957—58 లో మైనింగ్ ఇనిస్టిట్యూట్ ఒకటి గూడూరులో ఏర్పాటు చేయబడింది. రెకరింగు, నాన్ — రెకరింగు వ్యయాలకు సంబంధించి మొత్తం ఖర్చునంతా 1958—59 నుండి భరించటానికి భారత ప్రభుత్వం వారు యిప్పుడు ఒప్పుకొన్నారు. ఈ సంవత్సరం రు. 1.50 లక్షల ఖరీదయ్యే పరికరాలను కొనటానికి, 1958—59 లో ప్రారంభించిన భవనాల నిర్మాణాన్ని పూర్తి చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను కేంద్ర ప్రభుత్వం రు. 4.70 లక్షల మొత్తం యిస్తుంది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలకు, యితరవైద్యసంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చడం కోసం రెండవప్రణాళికా కాలంలో అదనంగా

495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదించబడింది. జిల్లా హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రులలోను యితర టీచింగ్ ఆసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి శిక్షణ యివ్వబడుతుంది. అదేప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటంకోసం ఈ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.02 లక్ష జిల్లాలోని నెల్లూరులో ఉన్న హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటంకోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జిల్లాకేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

రెండవ ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల మొత్తంఖర్చుతో అదనంగా భవనాలు నిర్మించటంద్వారాను, పరికరాలు, సిబ్బంది మొదలయినవాటిని సమకూర్చటంద్వారాను, ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అనేకమైన అభివృద్ధిపనులు చేయబడినాయి. జిల్లా ఆసుపత్రులను అభివృద్ధిపరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష మొత్తం నెల్లూరులోని జిల్లా ఆసుపత్రికి అభివృద్ధి పనులకు, నెల్లూరులోని విక్టోరియాజూబిలీ ఆసుపత్రిని ప్రభుత్వ స్వాధీనం చేసికొనుటకుగాను వినియోగించబడుతుంది.

## తాలూకా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

ఆంధ్ర ప్రాంతపు తాలూకా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులలో పడకల సంఖ్యను హెచ్చింపటంద్వారా అదనపు భవనాలను నిర్మించటంద్వారా వాటిని అభివృద్ధిచేయటంకోసం రెండవ ప్రణాళికయొక్క మొదటి 3 సంవత్సరాలకాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటంమూలంగా యీ జిల్లాలోని

కనిగిరి, గూడూరులలోఉన్న తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి కావలిలోని తాలూకా ఆసుపత్రిని ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించ బడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1956—58 సంవత్సరాలలో స్వాధీనం చేసికో బడినట్టి వెంకటగిరి, సూళ్ళూరు పేటలలోని ఆసుపత్రులను నిర్వహించడానికి, పొదిలి, కొవ్వూరు, రాపూరు, దర్శిలలో ఉన్న ఆసుపత్రులను యీ సంవత్సరం స్వాధీనం చేసికోవటానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరికట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను- 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించ వాటిని కొనసాగించ టానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.66 లక్ష కేటాయించ బడింది, ఇందులో రు. 0.02 లక్ష యీ జిల్లాలో వినియోగించబడుతుంది. ఇందులో రు. 0.02 లక్ష యీ జిల్లాలోని నెల్లూరులో స్థాపించ బడిన కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని కొనసాగించుటకు గాను వినియోగించ బడుతుంది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సాకేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్స

రంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగంచటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1857—58 లో నెల్లూరులోని ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకంక్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.50 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## దంత వైద్య కళాశాల, దంత చికిత్సా కేంద్రాల ఏర్పాటు

ఈ పథకంక్రింద ఈ సంవత్సరంలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.50 లక్షల మొత్తం ఆంధ్ర ప్రణాళికక్రింద, రు. 0.55 లక్ష తెలంగాణా ప్రణాళికక్రింద కేటాయించబడినాయి. ఇంతకుముందు ప్రారంభించిన దంత చికిత్సా కేంద్రాలను నిర్వహించటమే కాకుండా క్రొత్తవాటిని ప్రారంభించటానికి, హైదరాబాదులోని ఉస్మానియా వైద్య కళాశాలలో 1958—59 సంవత్సరంలో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికిగాను యీ డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.20 లక్ష నెల్లూరులోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 1958—59లో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని నిర్వహించుటకుగాను ప్రత్యేకించబడింది.

## క్షయరోగులకు ప్రత్యేక పడకలు

క్షయ రోగులకుగాను ఈ సంవత్సరంలో 290 ప్రత్యేక పడకలను ఆంధ్రలో ఏర్పాటు చేయడానికి, యింతకుముందు ఏర్పాటు చేసినవాటిని నిర్వహించటానికిగాను రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.70లక్ష నెల్లూరులోని జిల్లా ఆసుపత్రిలో క్షయరోగులకుగాను 50 ప్రత్యేక పడకలను ఏర్పాటుచేసే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకుముందు స్థాపించిన 5 సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలను కొనసాగించటానికి, యీ సంవత్సరం యింకా 3 కేంద్రాలను స్థాపించటానికిగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. 1957—58 లో నెల్లూరులోని జిల్లా ఆసుపత్రిలో స్థాపించబడిన సుఖవ్యాధి చికిత్సా కేంద్రం కొనసాగింపుకు పై డబ్బు వినియోగించబడుతుంది.

## చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాలు

ఈ సంవత్సరం యీపథకంకోసం కేటాయించబడిన రు. 0.30 లక్షలో రు. 0.06 లక్ష నెల్లూరులోని జిల్లా ఆసుపత్రిలో చెవి, ముక్కు, గొంతు చికిత్సా విభాగ మొకదాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది.

## నేత్ర చికిత్సాలయాలు

1958—59 లో రెండు నేత్ర చికిత్సాలయాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరం యింకా మూడు నేత్ర చికిత్సా కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ప్రస్తుతమున్న వాటిని కొనసాగించటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు. 0.06 లక్ష నెల్లూరులోని జిల్లా ఆసుపత్రిలో ఒక నేత్ర చికిత్సాలయాన్ని ఏర్పాటు చేయటంకోసం వినియోగించబడుతుంది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లలోనే కాన్పులు జరిగే పద్ధతిని మెరుగుపరచటానికిగాను 1956–57 సంవత్సరంలో యీ శిక్షణపథకం ప్రారంభించబడింది. నాటు మంత్రసానులకు (దాయీలు) ఉత్తమ పద్ధతుల్లో పురుళ్లు పోయటం గురించి యీ పథకంక్రింద శిక్షణ యివ్వడం జరుగుతుంది. ఇందువల్ల వారు తమవృత్తిని నైపుణ్యంతో కొనసాగించుకొనుటకు వీలు కలుగుతుంది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యీ పథకంక్రింద శిక్షణయివ్వడం నిమిత్తం 1,329 మంది అభ్యర్థులు చేర్చుకోబడినారు. ఈ సంవత్సరంలో యీ పథకం కొనసాగించబడుతుంది. ఇంకో 730 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకుగాను రాజ్య ప్రణాళికలో రు. 0.81లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 8,650 లు యీ జిల్లాలో 50 మంది అభ్యర్థులకు దాయీలుగా శిక్షణ యిచ్చుటకు వినియోగించబడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటి ప్రణాళికాకాలంలో ప్రారంభించబడిన రెండు మలేరియా నివారణ యూనిట్లు 1956—57 లో కొనసాగించబడినాయి. 1957—58లో అదనంగా మరో రెండు యూనిట్లు ఏర్పాటు చేయబడినాయి. ఈ నాలుగు యూనిట్లుకూడా 40 లక్షల మంది ప్రజలను మలేరియా బారినుండి రక్షించటం కోసం 1958—59 లో కొనసాగించబడినాయి. 1—4—1958 నుండి మలేరియా నివారణకు సంబంధించిన జాతీయ కార్యక్రమము మలేరియా నిర్మూలన కార్యక్రమంగా మార్చబడింది. ఈ కార్యక్రమంక్రింద అదనంగా మందులు చల్లే పరికరాల్ని, డి. డి. టి. మందును సరఫరా చేయటంద్వారా మలేరియా వ్యాపించని ప్రదేశాలనుకూడా కలుపుకొని రాజ్యంలోని అన్ని తావులలోను మందులు చల్లేపని తీవ్రతరం చేయబడుతుంది. ప్రస్తుతము 17 సబ్-యూనిట్లతోకూడియున్న 4 యూనిట్లను కొనసాగించటానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను స్థాపించడానికి, ప్రజారోగ్యశాఖ ప్రాంతీయ అసిస్టెంట్ డైరెక్టర్లను

మ్యగురిని నియమించడానికిగాను రాజ్య ప్రభుత్వ వాటాక్రింద 1959—60 ప్రణాళికలో రు. 22.27 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.87 లక్షల మొత్త[illegible] జిల్లాకు ప్రత్యేకించబడింది. ప్రస్తుత మున్న రెండు సబ్-యూనిట్లను కొనసాగించడానికి, ఒక [illegible] యూనిట్టును ప్రారంభించడానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## బోదవ్యాధి నివారణ కార్యక్రమం

మొదటి ప్రణాళికాకాలంలో యీ పథకంక్రింద రెండు సర్వే యూనిట్లు, ఒక నివారణ యూనిట్టు ఏర్పాటుచేయబడినాయి. రెండు సర్వే యూనిట్లుకూడ 30—9—56 వరకు మాత్రం కొనసాగించబడగా, నివారణ యూనిట్టుమాత్రం ప్రణాళిక యొక్క మూడు సంవత్సరాల కాలంలోను కొనసాగించబడింది. 1959—60 లో ఇంకా రెండు నివారణ యూనిట్లను* ఏర్పాటు చేయటానికి, పాత యూనిట్టును కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకయ్యే వ్యయంలో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో రు. 7.11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.13 లక్షలమొత్తం నెల్లూరు జిల్లాకు కేటాయించబడింది. ఒక క్రొత్తయూనిట్టును స్థాపించడానికై పై డబ్బు వినియోగించబడుతుంది.

## ఆరోగ్య ప్రచారం

ఆరోగ్య విషయాలనుగురించి ప్రజలకు వివరించేటందుకుగాను ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో కేంద్ర ఆరోగ్య విద్యా ప్రచారబ్యూరో ఒకటి ప్రారంభించబడింది. ఇంతకుముందుకొన్న 11 జీపులను, రెండు ఎపిడమిక్ కంట్రోలు మరియు ప్రచార వ్యానులను నిర్వహించడమేగాక మరో రెండు వ్యానులను కొనటం జరిగింది. క్రొత్తఢిల్లీలోని కార్యాచరణ సంఘం వారు 1958—59 లో యీ పథకాన్ని కొనసాగించుటకు సమ్మతించలేదు. అయినప్పటికి ప్రస్తుతము జిల్లాలలో ఉన్న 11 జీపులను, 4 వ్యానులను కొనసా

---

*క్రొత్తఢిల్లీలోని మలేరియా సంస్థ డైరెక్టరు యీ సంవత్సరం క్రొత్త యూనిట్లను స్థాపించరాదని సలహా యివ్వటంవల్ల యీ రెండు యూనిట్లను ఏర్పాటు చేయటం విరమించబడింది.

గించటానికి, కేంద్ర ఆరోగ్య విద్యా బ్యూరోను కొనసాగించటానికి. యింకా 8 క్రొత్తవ్యానులను ఖరీదు చేయటానికి, 3 ఆరోగ్య ప్రచార బ్యూరోలను స్థాపించటానికిగాను 1959—60 లో రు. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. కేటాయించబడిన రు. 4.15 లక్షల మొత్తంలో రు. 1.12 లక్ష యీ జిల్లాలో ఉన్న ఒక [illegible] వ్యాను నిర్వహణకుగాను ప్రత్యేకించబడింది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా.

## పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102,446 లక్షల మొత్తాన్ని (రు. 82.446* లక్షల మొత్తం కేంద్ర ప్రణాళిక క్రింద, రు. 20·00 లక్షల మొత్తం రాజ్యప్రణాళిక క్రింద) ఋణసహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41·270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 10.670 లక్షల మొత్తం క్రింద పథకాలకుగాను యీ జిల్లాలో వినియోగించబడుతుంది.

| | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం. (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | గూడూరు నీటిసరఫరా అభివృద్ధిపనులు | 2.670 |
| 2. | నెల్లూరు నీటిసరఫరా అభివృద్ధిపనులు | 8·000 |
| | మొత్తం | 10.670 |

# గృహనిర్మాణం

## మురికిపేటల నిర్మూలన, పాకీవారికి గృహవసతి

అనారోగ్యానికి ఆలవాలమైన మురికిపేటల విస్తరణను అరికట్టేటందుకు, ఆ పేటలలో నివసించేవారికి పునరావాసం కల్పించే నిమిత్తం మురికి పేటల

*ఇందులో రు. 5.446 లక్షల మొత్తం యీ పథకానికిగాను 1957—58 సంవత్సరంలో కేటాయించబడిన మొత్తంలో ఖర్చుపెట్టబడకుండా మిగిలిపోయినట్టిది.

నిర్మూలనా పథకాన్నొకదాన్ని భారత ప్రభుత్వంవారు రూపొందించారు. ఈ పథకాన్ని కొనసాగించే నిమిత్తం నెల్లూరులో పట్టణంలో మురికిపేటల నిర్మూలనకుగాను రు. 0·50 లక్ష కేటాయించ బడింది. ప్రతి పథకానికి అంచనా వేయబడే ఖర్చులో 75 వంతులు భారత ప్రభుత్వంవారు యిస్తారు. 50 వంతులు ఖర్చు ఋణంగాను, మిగత 25 వంతులఖర్చు సబ్సిడీగాను వారు యిస్తారు. మాచింగ్ గ్రాంటు రూపంలో రాజ్యప్రభుత్వం మిగత 25 వంతుల ఖర్చు భరిస్తుంది. ఇంతే కాక యీ జిల్లాలో పాకీవారికి 40 ఇళ్ళను నిర్మించే నిమిత్తం ప్రణాళికలో రు. 1.00 లక్ష (కేంద్ర ప్రభుత్వ సహాయం కలుపుకొని) కేటాయించబడింది.

### పట్టణాల్లో గృహనిర్మాణం-సహకార సంఘాలు

పట్టణ ప్రాంతాల్లో నివాస గృహాల కొరతను తీర్చటంకోసం సహకార పట్టణ గృహనిర్మాణం సంఘాల సభ్యులకు ఇళ్లు నిర్మించుకొనేటందుకుగాను దీర్ఘకాలికఋణాలు యివ్వటానికి యీ పథకంక్రింద ప్రతిపాదింపబడింది. ఆంధ్రలో క్రొత్తగా 340 గృహాల నిర్మాణం నిమిత్తం ఋణాలివ్వటంకోసం ఈ సంవత్సరంలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.50 లక్షల మొత్తం యీ జిల్లాలో 42 గృహాలనిర్మాణం నిమిత్తం ప్రత్యేకించబడింది.

## కార్మికులు - కార్మిక సంక్షేమం

### ఉదోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే

1. ఏరకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్న విషయాన్నియింకా ఖచ్చితంగా నిర్ణయించటం కోసం ఉద్యోగసాధక కేంద్రాల అధికారులకు యింకా ఎక్కువవివరాలను అందచేయటం.

2. విద్యాభ్యాసం పూర్తిచేసినవారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న యితర వ్యక్తులకు ఉద్యోగాలనుగురించి, ఉద్యోగావకాశాలను గురించి సలహాలనిచ్చే నిమిత్తం సమాచారాన్ని లభ్యంచేయటం.

3. ఉద్యోగ సాధక కేంద్రం యొక్క పరిధిలో ఉండేప్రాంతంలో గాని లేక ప్రత్యేక ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా ఏర్పాటు

చేయబడే ఇతర ప్రదేశాలలోగాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చేమార్పులను గమనించడానికి తగినవిధానాన్ని రూపొందించటం.

4. ప్రతిపరిశ్రమలోను వృత్తిలోను ఉద్యోగ, నిరుద్యోగరీతులను గురించి ముందు సూచనలు చేయటం.

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలులోని ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో యీ పథకం 1957—58 లో అమలు పరచబడింది. హైదరాబాదులోని నేషనల్ ఎంప్లాయిమెంట్ సర్వీస్ డైరక్టరేట్‌లో కేంద్రయూనిట్టు ఏర్పాటుచేయబడింది. 1958—59 లో కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు యీ పథకం విస్తరించ బడింది. విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలో ప్రయివేటు రంగానికి సంబంధించి 1959—60 లో పరిశీలన జరిపేటందుకు ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను నేషనల్ ఎంప్లాయ్‌మెంట్ సర్వీస్ డైరక్టరేటులోఏర్పాటుచేయబడిన కేంద్రయూనిట్టు ఒక సీనియరు ఆఫీసరు అధ్వర్యంలో ఉంచబడడం ద్వారా పటిష్ఠం చేయబడుతుంది. ఇంతేకాక పైన పేర్కొనబడిన ఉద్యోగ సాధక కేంద్రాలలోకూడ అదనపు సిబ్బంది నియమించబడుతుంది. ప్రతిఉద్యోగ సాధక కేంద్రంలోను ఒక గుమాస్తాను నియమించడం ద్వారా మిగత అన్ని కేంద్రాలలోని సిబ్బందినికూడ పెంచటానికి ప్రతిపాదింప బడింది.

ఈ పథకానికయ్యే ఖర్చుతో రాజ్యప్రభుత్వ వాటాక్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష కేటాయించ బడింది, కేంద్ర ప్రభుత్వం వాటా క్రింద రు. 0.47 లక్ష కేటాయించ బడింది. కేటాయించబడిన మొత్తం రు. 0.78 లక్షలో రు. 0.012 లక్ష. యీ జిల్లాలోని కార్యక్రమమునకు గాను వినియోగించ బడుతుంది.

## నెల్లూరిలోని వృత్తిపనివారి పారిశ్రామిక శిక్షణ కేంద్రంలో శిక్షణ సౌకర్యాల విస్తరణ

96 మంది అభ్యర్థుల చేసున్చుకోవడానికి వీలుగా ఈ సంస్థ 1957—58 లో స్థాపించ బడింది. 1958—59 లో రెండవ "షిఫ్టు" యీ సంస్థలో ప్రవేశ పెట్ట బడింది. ఇందువల్ల యింకా 96 మంది అభ్యర్థులను చేర్చుకోవటానికి వీలు

కల్పించ బడింది. 1959—60 లో రు. 3.53 లక్షల మొత్తం యీ సంస్థకోసం క్రిందివిధంగా ఖర్చుపెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 1.41 లక్షల మొత్తం రాజ్యప్రభుత్వం భరిస్తుంది.

| | | మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| భవనాల నిర్మాణం | .... | 1.00 |
| పరికరాల కొనుగోలు | .... | 1.29 |
| సిబ్బందికీ, చిల్లర ఖర్చులకు | .... | 1.24 |
| | మొత్తం | 3.53 |

# వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు

### షెడ్యూల్డుకులాలవారికి స్కాలరు షిప్పులు

షెడ్యూల్డు కులాలవారికి, అర్హులైన యితర కులాల విద్యార్థులకుకూడ ఈ పథకంక్రింద అన్ని విద్యాదశలలోను స్కాలరు షిప్పులు యివ్వబడుతున్నాయి. హైస్కూలు విద్యార్థుల విషయంలో వారి తలిదండ్రుల ఆదాయం రు. 1,500 లకు మించనప్పుడు, కాలేజి విద్యార్థుల విషయంలో వారి తలిదండ్రుల ఆదాయం 1,800 లకుమించనప్పుడు వారికి పూర్తి జీతం మినహాయింపు కలుగచేయబడుతున్నది. అదనంగా-దాదాపు 1,600 స్కాలరు షిప్పులు యివ్వడానికి, ఇంతకుముందే మంజూరుచేసిన వాటిని కొనసాగించటానికిగాను 1959—60 సంవత్సరానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకుకూడ యీ స్కాలరు షిప్పులు లభ్యమవుతాయి.

### షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్ళు

ఆంధ్ర ప్రాంతంలో 438 సబ్సిడైజుడు హాస్టళ్లు ఉన్నాయి. వెనుకబడిన తరగతులకు, హారిజన కులానికి చెందిన విద్యార్థులకు బోర్డింగు

గ్రాంటులు పటా యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు గ్రాంటుగా యివ్వబడుతున్నది. అదనంగా యింకా 670 బోర్డింగు గ్రాంటులను యివ్వటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు

ఈ జిల్లాలోని రాపూరులో ఉన్న హాస్టలు రు. 0.062 లక్ష వ్యయంతో నిర్వహించబడుతుంది.

## పాఠశాలలు, హాస్టళ్ల భవనాల నిర్మాణం

ఆంధ్ర ప్రాంతంలో సాంఘిక సంక్షేమ శాఖవారి అజమాయిషీక్రింద నిర్వహింపబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సబ్సిడైజుడు హాస్టళ్లు అద్దె భవనాల్లో ఏర్పాటు చేయబడ్డాయి. ఇందువల్ల హరిజనుల సౌకర్యార్థం నిర్వహించబడుతున్న సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడైజుడు హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించటానికి ప్రతిపాదించబడింది. 25 పాఠశాల భవనాల నిర్మాణనిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది. ఇందులో 3 భవనాలు యీ జిల్లాలో రు. 0.10 లక్ష వ్యయంతో నిర్మించబడతాయి.

## పారిశుద్ధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మరుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959—60లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో యీ జిల్లాలో 20 బావులు రు. 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకంక్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించుటకోసం దానివల్ల కలిగే అనర్థకాలను గురించి ప్రచారం చేయడానికి వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి పత్రికలకు సబ్సిడీలు ఇవ్వటానికి పోస్టర్లు, కరపత్రాలు ముద్రించటానికి- హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్ట్ ఆఫ్ సర్వీసు రెడ్‌క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు, హరిజనోద్ధరణకు పాటుపడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికి యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను, రు. 500 లు ఋణంగాను ఇవ్వడం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తి కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతోకలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడినవి. ఈ జిల్లాలో 64 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48లక్ష కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి.

### వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

### వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహించబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడిననాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50

లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకి కూడ యిందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠశాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయడానికి యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను, రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0,09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

### గృహనిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 98 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 98 పాత యిళ్ల మరమ్మతులకుగాను రు. 0.1285 లక్ష కేటాయించబడింది.

### ప్రజారోగ్యం

ఈ జిల్లాలో రెండు క్రొత్తబావులను త్రవ్వటానికి, మూడు మరుగుదొడ్లను నిర్మించటానికి 1959—60 ప్రణాళికలో రు. 0.065 లక్ష కేటాయించబడింది.

### వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులవారికి అర్థికంగా సహాయపడేటందుకు వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడి ఎద్దులను చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాత బావుల మొదలయినవాటిని మరమ్మతులు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాకు 4 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 1,200 లు కేటాయించబడినాయి.

### కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు, ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,750లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 35 మందికి లాభం చేకూరుతుంది.

### వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. వై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 240లు యీజిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన 6 మందికి "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వటంకోసం యీ బబ్బు వినియోగించబడుతుంది.

## స్త్రీ సంక్షేమం

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమశాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమశాఖ కార్యక్రమాలను తీవ్రంచేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ పరికరాలు,

పొందు ప్రొజెక్టర్లు, విద్యాబోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు, కుట్టు మిషనులు మొదలయినటువంటి పరికరాలను, యితర ముఖ్య సామాగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీ సంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరా చేయుటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 900లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి.

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను నిర్వహించటానికి ఈ జిల్లాలో మొదటిదశ బ్లాకులో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ సంక్షేమవిస్తరణ యీ జిల్లాలోని కేంద్రాన్ని నెలకొల్పడానికి అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటాక్రింద ఈసంవత్సరానికి రు. 0.386 లక్ష కేటాయించబడింది. పిటికయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డులు, రాజ్యప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుండి సేకరించబడే మ్యాచింగ్ కంట్రిబ్యూషన్లుకూడ యిందుకు తోడవుతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ కార్యక్రమాలు

కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్సు నుండి విడుదల అయ్యే స్త్రీలకుగాను రాజ్య స్థాయిలో ఒక సదనాన్ని నెలకొల్పేటందుకు, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 మగవారికి, 11 స్త్రీలకు) నెలకొల్పేటందుకు, యింతేకాక రాజ్యంలో యిదివరకే నెలకొల్పబడిన రాజ్యస్థాయిలోని సదనాలను, జిల్లా ఆశ్రయ కేంద్రాలను కొనసాగించేటందుకు అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.141 లక్ష, నెల్లూరులో పురుషులకుగాను ఏర్పాటు చేయబడిన జిల్లా ఆశ్రయ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## భిక్షుకగృహం

భిక్షుక వృత్తితో జీవించే 60 మందికి ప్రాథమిక విద్య గరపటానికి, పాదరక్షలు తయారు చేయటం, వడ్రంగం, నేతపని, దర్జీపని మొదలగు

చేతివృత్తులకు శిక్షణ యివ్వటానికిగాను యీ జిల్లాలో ఒక శిక్షుకగృహాన్ని 1959–60లో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించబడింది. వీరికి భోజన, వైద్య సౌకర్యాలు సమకూర్చబడతాయి. ఇందుకు రు. 0.30 లక్ష ఖర్చవుతుంది. గ్రాంటు-ఇన్-ఎయిడ్ పథకంక్రింద పై డబ్బు సమకూర్చబడుతుంది.

# మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు

మునిసిపాలిటీలయొక్క, రెండుపట్టణ పంచాయితీలయొక్క ఆదాయ మార్గాలను అభివృద్ధిచేసే ఉద్దేశంతోను, ప్రజలకు పౌరసౌకర్యాలను అదనంగా సమకూర్చే ఉద్దేశంతోను దీర్ఘకాలిక ఋణాలరూపంలో ఆర్థికసహాయం చేసేటందుకుగాను రెండవప్రణాళికలో రు. 47.54 లక్షలమొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 21.42 లక్షలమొత్తం మొదటి మూడుసంవత్సరాల కాలంలో ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరానికిగాను రు. 11.59 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.60 లక్ష 1958—59 లో టౌనుప్లానింగు డైరక్టర్ కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించ టానికి వినియోగించబడుతుంది. మిగత రు. 11.44 లక్షల మొత్తంలో రు. 0.69 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. అప్పుమొత్తం, అప్పుయివ్వబడే స్థానికసంస్థపేరు, ఎందునిమిత్తం యీ అప్పు యివ్వబడుతున్నది.—యీ వివరాలు క్రింద యివ్వబడినాయి.

| స్థానికసంస్థపేరు | పని పేరు | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| నెల్లూరు పురపాలక సంఘం | సంతపేట మార్కెట్ నిర్మాణం | 0.60 |
| | మొత్తం | 0.60 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియోసెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 493 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో 311 సెట్లుమాత్రం

1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 82 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి, 1-4-1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.393 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలనుగురించి ప్రచారంచేయటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 20,319 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడతాయి.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు | 8,028 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... | 2 400 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయుడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి | 900 |

| | | |
|---|---|---|
| 6. | జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. | 2,280 |
| 7. | సంచార వ్యానులకు పరికరాలు. | 5,000 |
| 8. | ప్రస్తుతమున్న పబ్లిక్ గ్రంథాలయాలలో పైలట్ ప్రాతిపదికపై సమాచార కేంద్రాలను నిర్వహించటం. | 960 |
| | మొత్తం | 20,319 |

# అర్థగణాంకశాఖ

1959—60 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో నియమించబడతారు. జిల్లాస్థాయిలో రాజ్యంయొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టు చేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికతో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

# తంతి తపాలా సౌకర్యాలు

1959—60 లో 37 తపాలా ఆఫీసులను స్థాపించటానికి, ఇంతేకాక ఒక టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసును కోటలో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. కొవ్వూరులో ఒక టెలిఫోను ఎక్స్చేంజిని, ఆత్మకూరు, కనిగిరి మరియు పొదిలి, దర్శి, ఉదయగిరి, రాపూరు, సైదాపురంలలో 5 పబ్లిక్ కాల్ ఆఫీసులను ఏర్పాటు చేయటానికికూడ ప్రతిపాదింప బడింది.

# రైలు మార్గాలు

నెల్లూరు జిల్లా లో రైలుమార్గాలకు సంబంధించి 1959—60 లో క్రింది కార్యక్రమం అమలు జరుప బడుతుంది.

| వరుస సంఖ్య | పనివివరం | అంచనా వేయబడిన ఖర్చు (వేల రు. లతలో) |
|---|---|---|
| 1. | విజయవాడ—గూడూరు సెక్షన్ లైన్ కెపాసిటీ పనులు వేదయపాలెం, వెంకటాచలం క్రాసింగు స్టేషనులు క్రొత్తగా ఏర్పాటు చేయటం. | 714 |
| 2. | మదరాసు, విజయవాడ సెక్షను— కావలి- చెవూర్ల మధ్య మైలు 143/ 13-14 వద్ద 477 నెంబరువంతెనను (4 × 40 ' గర్డర్లు) ప్రస్తుత మున్న గర్డర్లను ఉపయోగిస్తూ పునర్నిర్మించటం. | 350 |
| 3. | మద్రాసు— విజయవాడ సెక్షను— 84/6 —97/17 మైళ్ళ మధ్య ప్రస్తుతమున్న 90 "ఆర్" రెండవరకం పట్టాల స్థానంలో 90 పౌన్ల "ఆర్" పట్టాలను వేయటం : 13 మైళ్ళ పర్యంతం వెల్డింగు చేయటం | 5,102 |

# నెల్లూరు జిల్లా ప్రణాళిక,

# అభివృద్ధిసంఘం సభ్యుల జాబితా

1. జిల్లా కలెక్టరు — అధ్యక్షుడు
2. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి, ఎం. ఎల్- ఎ., — ఉపాధ్యక్షుడు
3. జిల్లాప్లానింగు ఆఫీసరు. — పదవీరీత్యాకార్యదర్శి

## పదవీరీత్యా సభ్యులు

4. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. నెల్లూరు.
5. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. కాళహస్తి

6. జిల్లా వ్యవసాయశాఖాధికారి, నెల్లూరు
7. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు(నార్తు), నెల్లూరు
8. సహకార సంఘాలడిప్యూటి రిజిస్ట్రారు (సౌత్), నెల్లూరు
9. జిల్లా మెడికల్ ఆఫీసరు, నెల్లూరు
10. జిల్లా పశు వైద్యశాఖాధికారి, నెల్లూరు
11. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, నెల్లూరు
12. డివిజనల్ ఇంజనీరు, హైవేస్, నెల్లూరు
13. డివిజనల్ ఇంజనీరు, ఎలక్ట్రిసిటి, నెల్లూరు
14. డివిజనల్ ఇంజనీరు, ఎలక్ట్రిసిటి, గూడూరు
15. జిల్లా విద్యాశాఖాధికారి, నెల్లూరు
16. జిల్లా విద్యా శాఖాధికారి, కనిగిరి
17. జిల్లా పంచాయతి ఆఫీసరు, నెల్లూరు
18. ప్రత్యేక జిల్లా విద్యాశాఖాధికారి, నెల్లూరు
19. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, నెల్లూరు
20. జిల్లా సంక్షేమాధికారి. నెల్లూరు
21. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, నెల్లూరు
22. జిల్లా అటవీ శాఖాధికారి. నెల్లూరు (నార్తు)
23. జిల్లా అటవీ శాఖాధికారి, నెల్లూరు (సౌత్)
24. ఇనస్పెక్ట్రెస్ ఆఫ్ గర్ల్స్ స్కూల్స్, నెల్లూరు
25. అసిస్టెంటు కమీషనరు, హిందూదేవాదాయ, ధర్మాదాయ శాఖ, నెల్లూరు.
26. సెక్రటరీ, మైకాగనులు, కార్మిక సంక్షేమ నిధి, నెల్లూరు
27. అసిస్టెంటు రేడియో ఇంజనీరు. చిత్తూరు
28. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, ఒంగోలు
29. అసిస్టెంటు ఉమన్ వెల్ఫేర్ ఆఫీసరు. నెల్లూరు

30. ఫిషరీస్ అసిస్టెంటు డైరెక్టరు, నెల్లూరు
31. జిల్లా నేషనల్ సేవింగ్సు ఆర్గనైజరు, నెల్లూరు
32. జిల్లా నేషనల్ సేవింగ్స్ ఆర్గనైజరు, నెల్లూరు
33. జిల్లా ఎంప్లాయిమెంటు ఆఫీసరు, నెల్లూరు
34. సీనియర్ మలేరియా ఎంటమాలజిస్టు నెల్లూరు

బ్లాకు ప్రణాళిక. అభివృద్ధి సంఘాల అధ్యక్షులు

35. అసిస్టెంటు కలెక్టరు, గూడూరు
36. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, నెల్లూరు
37. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, కావలి
38. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, కందుకూరు

బ్లాకు డెవలప్మెంటు ఆఫీసర్లు

39. బ్లాకు డెవలప్మెంటు ఆఫీసరు, వెంకటాచలం
40. ,, పొదలకూరు
41. ,, ఇందుకూరుపేట
42. ,, తోటపల్లిగూడూరు
43. ,, ఉదయగిరి
44. ,, తాళ్ళూరు
45. ,, దత్తి
46. ,, వెంకటగిరి
47. ,, గూడూరు
48. ,, చేజెర్ల
49. ,, నాయుడుపేట
50. ,, కొండపి

51. బ్లాకుడెవలప్‌మెంటు ఆఫీసరు, ఆత్మకూరు

52. ,, వెలిగండ్ల

## పార్లమెంటు సభ్యులు

53. శ్రీ ఆర్. లక్ష్మీనరసారెడ్డి, నెల్లూరు

54. ,, బి. అంజనప్ప, నెల్లూరు

55. ,, సి. బాలిరెడ్డి, కంభం, కర్నూలుజిల్లా

## విధాన సభ సభ్యులు

56. శ్రీ వి. కోదండరామిరెడ్డి, తోటపల్లిగూడూరు

57. ,, ఎస్. వేమయ్య, నెల్లూరు

58. ,, బి. శంకరయ్య, నెల్లూరు

59. ,, బి. రామకృష్ణారెడ్డి, అల్లూరు

60. ,, కె. వెంకటరెడ్డి, వింజమూరు

61. ,, షేక్‌మౌలాసాహెబ్, ఉదయగిరి

62. ,, జి. ఎల్లమందారెడ్డి, కనిగిరి

63. ,, ఎస్. కాశిరెడ్డి, పొదిలి

64. ,, డి. వి. రమణారెడ్డి. మార్కాపురం

65. ,, ఎన్. చెంచురామా నాయుడు, చింతలపాలెం, కందుకూరు తాలూకా

66. ,, పి. గోపాలకృష్ణారెడ్డి, కోట

67. ,, ఎం. మునుస్వామి, మోదుగులపాడుగ్రామం

68. ,, పి. వెంకటస్వామిరెడ్డి, పాలుగోడు

69. ,, ఎ. కృష్ణయ్య, వల్లివేడు

70. ,, డి. కొండయ్యచౌదరి, కందుకూరు

71. ,, ఎ. సంజీవరెడ్డి, కమ్మిరెడ్డిపాడు

## విధానమండలి సభ్యులు

72. శ్రీ పి. వెంకటకృష్ణారెడ్డి, గూడూరు
73. ,, పి. వీరరాఘవరెడ్డి, గూడూరు
74. ,, ఎం. వి. కృష్ణారెడ్డి, నెల్లూరు
75. ,, ఎస్. రామకృష్ణయ్య, నెల్లూరు
76. ,, బి. పాపిరెడ్డి, బుచ్చిరెడ్డిపాలెం

## ఇతర అనధికార సభ్యులు

77. శ్రీ పి. సిద్ధయ్యనాయుడు, గూడూరు, గూడూరు పురపాలక సంఘం అధ్యక్షుడు
78. శ్రీ ఎం. రామిరెడ్డి, పొత్తెంపాడు
79. శ్రీ దశరథరామిరెడ్డి, కో—ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు, నెల్లూరు
80. శ్రీ డి. బలరామిరెడ్డి, ఇందుకూరుపేట పంచాయతిసమితి అధ్యక్షుడు
81. శ్రీ కె. చిన్నయ్య, కొండూరుపాలెం, కొవ్వూరుతాలూక
82. శ్రీ ఇ. పట్టాభిరామిరెడ్డి, హరిజన సేవకసంఘం కార్యదర్శి నెల్లూరు
83. శ్రీ ఎస్. సుందరరాజన్, రెడ్ క్రాస్ సంఘం కార్యదర్శి, నెల్లూరు
84. శ్రీమతి ఎ. అన్నపూర్ణమ్మ, సుబేదార్ పేట, నెల్లూరు
85. శ్రీమతి డి సుబ్బరత్నమ్మ, నెల్లూరు
86. శ్రీ జి. వి. రమణారెడ్డి, నెల్లూరు
87. ,, ఎం. శంకరరెడ్డి, పంచాయతీ అధ్యక్షుడు, ఆత్మకూరు
88. ,, ఎం. శంకరయ్య. చెంచులూరు, ఉదయగిరి తాలూక
89. ,, ఇ వేణుగోపాలరెడ్డి, తాడ, సూళ్ళూరుపేట తాలూక

90. శ్రీ టి. వి. కృష్ణారెడ్డి, భారత సేవక్ సమాజ్ కన్వీనరు, చెన్న పల్లిపాలెం, నెల్లూరు తాలూక

91. ,, పి. ఐజాక్, కొనకోలమిట్ట. పొదిలితాలూక

92. ,, ఎం. చెంచయ్య, ముండ్లమూరు గ్రామం. దర్శితాలూక

93. ,, జి. తిరుపతినాయుడు, తాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు. ఆత్మకూరు తాలూక

94. ,, మహమద్ జాఫర్ సాహెబ్, ఉదయగిరి

95. ఎన్. గోపాలకృష్ణయ్య, నెల్లూరు

96. పి. దశరథరామిరెడ్డి, స్టేటు నేషనల్ సేవింగ్స్ అడ్వయిజరీ కమిటీ సభ్యుడు, గూడూరు

97. శ్రీమతి పి. వసుంధర, గిల్డు ఆఫ్ సర్వీసు కార్యదర్శి, నెల్లూరు

98. డాక్టరు బి. గోపాలరెడ్డి, రాజ్యసభసభ్యుడు

